# మనవి

బ్రహ్మశ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిలవారు, సుభాషిత తారావళి, సుభాషిత రత్నాకరము, సుభాషిత రత్న భాండాగార మను గ్రంథరాజములఁ గల శ్లోక రత్నముల నేర్చి సుభాషిత మణి కంఠహారముఁ గూర్చి భారతి నలంకరించిరి. బ్ర॥ శ్రీ॥ ఆదిభట్ల తరిణయ్య సిద్ధాంతిగారి సుభాషితముల నాంధ్రీకరింప నన్నెంతయు హెచ్చరించిరి. నా నేర్చినకొలంది నాంధ్రీకరించితిని. మ॥ రా॥ శ్రీ దేవరాజు వేంకట కృష్ణారావుగారిచే బ్రతివారము ప్రకటింపఁబడు చుండెడి "వేగుఁజుక్క" యను పత్రికలోఁ గొన్ని పద్యములు వరుసగఁ బ్రచురింపఁబడుచుండెడివి. అందలి పద్యము లితరాంధ్ర పత్రికలయందు సహితముఁ బ్రచు[redacted] నితరులు కొంద ఱీ సుభాషిత పద్యముల, గ్రంథరూపమునఁ బ్రకటింప [redacted] గోరుచుండుటచే, "అభినవ భర్తృహరి" యను నామమున నీగ్రంథ మిప్పటి కీవిధముగ ముద్రింపఁబడు భాగ్యము లభించినది. మఱియు సమాలోచనాసమితి వారీ గ్రంథము నెంతయు బహూకరించిరి. మ॥రా॥శ్రీ॥ దేవరాజు వేంకట కృష్ణారావుగారీ గ్రంథము నంతయుఁ దుదివఱకుఁ బఠించి, యుచిత రీతిని నన్ను సత్కరించుటకుఁగా, వేగముగ ముద్రించి నా కొసంగిరి. వారిఁగూర్చి నే నధికముగ వ్రాయుటకంటెఁ "బ్రశంస" యను శీర్షికతో నిందుఁగల పద్యములఁ బఠింపఁ బాఠకమహాశయులఁ గోరెదను. బ్ర॥శ్రీ॥ నాగలింగశాస్త్రిలవారికిని, సమాలోచనాసమితికి నధ్యక్షులగు, బ్ర॥ శ్రీ॥ తరిణయ్య సిద్ధాంతిగారికిని, మ॥ రా॥ శ్రీ వేంకట కృష్ణారావుగారికి నెంతయుఁ గృతజ్ఞుఁడను.

బరంపురము
15—12—24.

ఇట్లు విధేయుఁడు,
భాగవతుల నృసింహశర్మ,
గ్రంథకర్త.

# ప్రశంస

ఉ॥ సోముని, భారతీవదన ♦ సోమునిఁ జూచి హసించి, సృష్టియన్
గీమున దివ్వెయై వెలుఁగు ♦ కీర్తి సతిన్ వలపించినట్టి శ్రీ
రాముని కంకితంబుగ వి ♦ రాజిలు నీ కృతి రత్నమందునే,
నే నుతి యెన్నఁ జందునె క ♦ వీంద్ర విభావునిఁ గృష్ణరావునిన్॥

మ॥ కవితా కామినికిన్ బ్రియుండు, కవిసం♦ఘంబున్ బ్రమోదింపఁజే
యు వివేకంబుఁగలట్టి ధీయుతుఁడు, ధీ ♦ రోదార చిత్తుండు, సూ
రి విధేయుం డలఘుండు, పండితనుత ♦ శ్రీ దేవ రాజాన్వయా
ర్ణవ సంభూత రమాసహోదరుఁడు కృ♦ష్ణారావు సామాన్యుఁడే!

మ॥ కవితా కామినికిన్ బ్రియుండనిన ని♦క్కంబెట్లు గాకుండునో!
కవిపున్నం గడు గౌరవించుఁ గవితన్♦గామించుఁ బ్రేమించు; దు
ష్కవి నేనేన్ జ్ఞానములేని బాలకవి నేన్ ♦ గర్హింపఁ డెన్నండు; సం
స్తవనీయుం డుపకారలాలసుఁడు కృ♦ష్ణారావు సామాన్యుఁడే!

శా॥ "జ్ఞానం బేమియు లేదు గానమున, నై♦నన్ వీను లుప్పొంగ వీ
ణానాదంబున కాత్మలో మిగుల నా♦నందించెదం గాని బ్ర
హ్మానందం బొదవున్ గవిత్వమన నా♦కత్యంత మే హేతువో
నేనొక్కింత యెఱుంగ" నంచుఁ బలుకున్;♦గీర్తింపరే యాతనిన్.

మ॥ నవలల్, నాటకముల్, మనోహరకథల్,♦నవ్యప్రబంధావళుల్,
వివిధంబుల్ ప్రకటించి, సత్కవులకున్ ♦ విఖ్యాతిఁ జేకూర్చి, మా
నవనాథుల్ కవినాథులున్ బొగడ, వి ♦ జ్ఞానంబుతో నీతఁ డీ
భువి రాజిల్లెఁ బ్రభాతతారకొక సొం♦పుఁ గూర్చు కీర్తిద్యుతిన్॥

ఉ॥ అల్లన నల్లుఁడై తనదు ♦ నత్తకు మామకు, ముద్దుబిడ్డఁడై,
తల్లికిఁ దండ్రికిన్ యశము ♦ తళ్కుగు క్రొత్తఁగ నంకితంబుగా
సల్లలిత ప్రబంధములఁ ♦ జక్కగ వ్రాసి, జగద్ధితార్థమై
తెల్లడిఁ జేసెఁ బండిత క ♦ వి ప్రకర ప్రముద ప్రదంబుగన్.

మ: పరసాంస్కృత ముగ్ధ సాగరమునన్ ◆ వర్తించు విద్వత్కవి
శ్రేష్ఠుల్ మెచ్చిరహో దురేమి యొకగొ◆ప్పా? భాషలో నొక్కయ
క్కరముం జూడని వానియందుఁ గవితా◆జ్ఞానంబుఁ గల్పించి, బా
లుఁ బుత్సాహము మోహముం గొలుపఁ జే◆లోకుల్ ప్రశంసింపఁగన్.

సీ: కవుల నాపదవేళఁ ◆ గాపాడఁ దలఁచెనా,
హృదయంబుఁ బెకలించి ◆ యిడుదు వైచుఁ;
బరిహాసమున కైన ◆ వాగ్దాన మిచ్చెనా,
తన ప్రాణముల నైన ◆ ధార వోయుఁ;
నిచ్చమై నొక తరి ◆ మెచ్చి మన్నించెనా,
యల్పచిత్తుని నైన ◆ నలఘుఁ జేయుఁ;
దలియక యొకమాట ◆ చెలిమిఁ గావించెనా,
మూఢుని నైన ◆ [illegible]ఁ జేయు;
గీ: నాత్మఁ గోపించి చూచెనా, ◆ యంతలోనఁ
గొండ యంతటివానిని ◆ బెండుఁ జేయు;
విద్దియల ప్రోవు. కవులకు ◆ వేల్పుటావు,
కీర్తికాంతకు కాంతు, శ్రీ ◆ కృష్ణరావు.

ఉ: బాలురసైత మెట్లయిన ◆ బుద్ధ్యకు లల్లిన సంతసించు స
ద్భేదుఁడు కృష్ణరావు కవి ◆ శేఖరులన్ గడు గౌరవింపఁగన్
జాలఁడె! సత్కవీంద్రకృత ◆ సత్కృతులన్ బ్రకటించి, భాషకున్
మే లొనరించువాని, గవి ◆ మిత్రుని మెచ్చిన దోసమున్నదే!

ఇట్లు,
గ్రంథకర్త.



# విషయ సూచిక


| విషయసూచిక | పుట సంఖ్య |
|---|---|
| సత్యాకృష్ణ సంవాదము | 1 |
| గోపికా శ్రీకృష్ణుల సంవాదము | 1 |
| పార్వతీ పరమేశ్వరుల సంవాదము | 2 |
| బ్రహ్మ | 2 |
| సరస్వతి | 2 |
| గణేశధ్యానము | 2 |
| ప్రస్తావన | 3 |
| సుజన ప్రశంస | 4 |
| దుర్జన నింద | 6 |
| విద్వత్ప్రశంస | 10 |
| మూర్ఖ వర్ణనము | 10 |
| విద్యా ప్రశంస | 12 |
| ధనము | 12 |
| సుకవి ప్రశంస | 14 |
| దాతృప్రశంస | 15 |
| తేజస్వి ప్రశంస | 15 |
| ఉదార ప్రశంస | 16 |
| ధీర ప్రశంస | 16 |
| గుణ ప్రశంస | 17 |
| సంతోష ప్రశంస | 17 |
| దారిద్ర్య వర్ణనము | 18 |
| యాచక నింద | 19 |
| కృపణ నింద | 21 |
| కలి మహిమ | 22 |
| తృష్ణా నింద | 24 |
| దైవము | 25 |
| ఉద్యోగ ప్రశంస | 25 |
| పరగృహవాసము | 26 |
| ఋణము | 26 |
| కళత్రము | 27 |
| ఉదర పూరణము | 27 |
| మౌన గుణము | 28 |
| వ్యాకరణజ్ఞుల స్తుతినింద | 28 |
| వైద్యాపహాసము | 28 |
| గణకాది ప్రశంస | 29 |
| లక్ష్మీ స్వభావము | 29 |
| సత్సంగతి | 30 |
| స్థాన మాహాత్మ్యము | 31 |
| జిహ్వ | 31 |
| మనస్సు | 32 |
| పశ్చాత్తాపము | 33 |
| గృహస్థాశ్రమము | 33 |
| ముదిమి | 34 |
| సంసారము | 35 |
| కాలము | 35 |
| క్షమ | 37 |
| క్షుధ | 37 |
| స్వభావము | 38 |
| జీవితసాఫల్యము | 38 |
| పరోపకృతి | 38 |
| బ్రహ్మలిఖితము | 39 |
| అనుచితఘటన | 39 |
| అసంతోషము | 40 |
| ప్రవాసము | 40 |
| సేవక నింద | 40 |
| వాగ్వర్ణనము | 41 |
| వాగ్మిప్రశంస | 41 |
| అసత్యవాదినింద | 41 |
| కృతఘ్ననింద | 42 |
| వైదిక ద్విజులు | 42 |

మ॥ వరసారస్వత దుగ్ధ సాగరమునన్ • వర్తించు విద్వత్కవీ
శ్వరులన్ మెచ్చిరహింతు లేమి యొకగా • ర్వా? భాషలో నొక్క య
క్కరమున్ జూడని వానియందుఁ గవితా • జ్ఞానంబుఁ గల్పించి, బా
లుర కుత్సాహము మోహముం గొలువఁడే • లోకుల్ ప్రశంసింపఁగన్.

సీ॥ కవుల నాపదవేళఁ • గాపాడ దలఁచెనా,
హృదయంబుఁ బెకలించి • కుదువ వైచుఁ;
బరిహాసమున కైన • వాగ్దాన మిచ్చెనా,
తనప్రాణముల నైన • ధారవోయు;
నిచ్చమై నొక తఱి • మెచ్చి మన్నించెనా,
యల్పచిత్తుని నైన • నలఘుఁ జేయుఁ;
దెలియక యొకమాఱు • చెలిమిఁ గావించెనా,
మూఢుని నైనను • ప్రౌఢుఁ జేయు;
గీ॥ నాత్మఁ గోపించి చూచెనా, • యంతలోనఁ
గొండ యంతటివానిని • బెండుఁ జేయు;
విద్దియలప్రోవు, కవులకు • వేల్పుటావు,
కీర్తికాంతకు తావు, శ్రీ • కృష్ణరావు.

ఉ॥ బాలురసైత మెట్లయిన • బద్యము లల్లిన సంతసించు స
చ్ఛీలుఁడు కృష్ణరావు కవి • శేఖరులన్ గడు గౌరవింపఁగన్
జాలఁడె! సత్కవీంద్రకృత • సత్కృతులన్ బ్రకటించి, భాషకున్
మే లొనరించువాని, గవి • మిత్రుని మెచ్చిన దోసమున్నదే!

ఇట్లు,
గ్రంథకర్త.



# విషయ సూచిక


| విషయసూచిక | పుట సంఖ్య |
| --- | --- |
| సత్యాకృష్ణ సంవాదము | 1 |
| గోపికా శ్రీకృష్ణుల సంవాదము | 1 |
| పార్వతీ పరమేశ్వరుల సంవాదము | 2 |
| బ్రహ్మ | 2 |
| సరస్వతి | 2 |
| గణేశధ్యానము | 2 |
| ప్రస్తావన | 3 |
| మహాజన ప్రశంస | 4 |
| దుర్జన నింద | 6 |
| విద్వత్ప్రశంస | 10 |
| మూర్ఖ వర్ణనము | 10 |
| విద్యా ప్రశంస | 12 |
| ధనము | 12 |
| సుకవి ప్రశంస | 14 |
| దాతృప్రశంస | 15 |
| తేజస్వి ప్రశంస | 15 |
| ఉదార ప్రశంస | 16 |
| ధీర ప్రశంస | 16 |
| గుణ ప్రశంస | 17 |
| సంతోష ప్రశంస | 17 |
| దారిద్ర్య వర్ణనము | 18 |
| యాచక నింద | 19 |
| కృపణ నింద | 21 |
| కలి మహిమ | 22 |
| తృష్ణా నింద | 24 |
| దైవము | 25 |
| ఉద్యోగ ప్రశంస | 25 |
| పరగృహవాసము | 26 |
| ఋణము | 26 |
| కళత్రము | 27 |
| ఉదర పూరణము | 27 |
| మౌన గుణము | 28 |
| వ్యాకరణజ్ఞుల స్తుతినింద | 28 |
| వవైద్యాపహాసము | 28 |
| గణకాది ప్రశంస | 29 |
| లక్ష్మీ స్వభావము | 29 |
| సత్సంగతి | 30 |
| స్థాన మాహాత్మ్యము | 31 |
| జిహ్వ | 31 |
| మనస్సు | 32 |
| పశ్చాత్తాపము | 33 |
| గృహస్థాశ్రమము | 33 |
| ముదిమి | 34 |
| సంసారము | 35 |
| కాలము | 35 |
| క్షమ | 37 |
| క్షుధ | 37 |
| స్వభావము | 38 |
| జీవితసాఫల్యము | 38 |
| పరోపకృతి | 38 |
| బ్రహ్మలిఖితము | 39 |
| అఘటితఘటన | 39 |
| అసంభవము | 40 |
| ప్రవాసము | 40 |
| సేవకనింద | 40 |
| వాగ్వర్ణనము | 41 |
| వాగ్మిప్రశంస | 41 |
| అసత్యవాదినింద | 41 |
| కృతఘ్ననింద | 42 |
| వైదికద్విజులు | 42 |

| విషయసూచిక | పుట సంఖ్య |
|---|---|
| స్త్రీస్వభావనింద | 42 |
| కులవధూవృత్తము | 43 |
| అసతీచరితము | 44 |
| భర్తకు భార్యకు సంవాదము | 44 |
| అసతీ తత్వము | 44 |
| అసతీవిట సంవాదము | 44 |
| పుత్రి ప్రశంస | 45 |
| మదన వర్ణనము | 45 |
| విరహిజనోక్తి | 46 |
| మేఘాన్యోక్తి | 46 |
| సింహాన్యోక్తి | 47 |
| గజాన్యోక్తి | 47 |
| మృగాన్యోక్తులు | 48 |
| రాసభాన్యోక్తి | 48 |
| హంసాన్యోక్తులు | 49 |
| భ్రమరాన్యోక్తులు | 49 |
| కోకిలాన్యోక్తులు | 50 |
| చాతకాన్యోక్తులు | 50 |
| శుకాన్యోక్తి | 50 |
| కాకాన్యోక్తి | 50 |
| సముద్రాన్యోక్తులు | 51 |
| అగస్త్యాన్యోక్తి | 51 |
| నద్యన్యోక్తి | 52 |
| తటాకాన్యోక్తి | 52 |
| కమలాన్యోక్తులు | 53 |
| కూపాన్యోక్తి | 53 |
| రత్నాన్యోక్తులు | 53 |
| రంభాన్యోక్తి | 54 |

| విషయసూచిక | పుట సంఖ్య |
|---|---|
| సామాన్య వృక్షాన్యోక్తులు | 54 |
| కల్పవృక్షాన్యోక్తులు | 55 |
| చందనాన్యోక్తులు | 55 |
| అశోకాన్యోక్తి | 55 |
| మాలత్యన్యోక్తి | 56 |
| సహకారాన్యోక్తి | 56 |
| న్యగ్రోధాన్యోక్తి | 56 |
| శాల్మల్యన్యోక్తి | 56 |
| నింబాన్యోక్తి | 57 |
| బబ్బూలాన్యోక్తి | 57 |
| ఇక్ష్వన్యోక్తి | 57 |
| కంటకారికా న్యోక్తి | 58 |
| ధత్తూరాన్యోక్తి | 58 |
| ఈశ్వరాన్యోక్తి | 58 |
| సంకీర్ణాన్యోక్తులు | 59 |
| మిశ్రమ ప్రకరణము | 62 |


నవరసములు.


| | |
|---|---|
| శృంగారము | 61 |
| వీరరసము | 84 |
| కరుణారసము | 84 |
| అద్భుతరసము | 84 |
| హాస్యరసము | 85 |
| భయానకము | 87 |
| బీభత్సరసము | 87 |
| రౌద్రరసము | 87 |
| శాంతరసము | 88 |

# "వేగుఁజుక్క" గ్రంథమాల

## బరంపురం, ( గంజాంజిలా. )

### ఇదివరకు ప్రచురింపబడిన గ్రంథములు

| | చందాదారులకు | ఇతరులకు |
|---|---|---|
| 1. ఉషఃకాలము | ప్రతులు లేవు. | |
| 2. వాఁడే వీఁడు | 1 0 0 | 1 4 0 |
| 3. ప్రేమము | పునర్ముద్రణము. | |
| 4. సుహృల్లత | 0 12 0 | 1 0 0 |
| 5. పద్మినీపరిణయము | ప్రతులు లేవు. | |
| 6. విలాసార్జునము | డిటో | |
| 7. సగుణ (మొదటిభాగము) | 1 4 0 | 1 8 0 |
| „ (రెండవభాగము) | 0 10 0 | 0 12 0 |
| 9. „ (మూఁడవభాగము) | 0 10 0 | 0 12 0 |
| 10. కొత్తపెళ్ళి | 0 12 0 | 1 0 0 |
| 11. వేంకటరావు | 1 0 0 | 1 8 0 |
| 12. నేనే (వాఁడే వీఁడునకు 2వభా) | 1 0 0 | 1 6 0 |
| ♦13 కోటీశుతనయ (నిరూపక నవల) | 1 0 0 | 1 4 0 |
| 14. కాలూరాయి (నేనే) తరువాయి | 1 4 0 | 0 8 0 |
| 15. ప్రతిజ్ఞాచాణక్యము | 1 0 0 | 1 4 0 |
| 16. పద్మమాలి | 1 0 0 | 1 4 0 |
| 17. నానాఫడ్నవీస్ | 1 0 0 | 1 4 0 |

పోస్టేజీలు కొనువారే భరించవలెను.

♦ వేగుఁజుక్క పరిషన్మండలిచే 1922 సం॥మున బహుమాన పరీక్షా పఠనీయముగా నేర్పడి పరీక్ష గ్రంథనాటకాది, నాటకపదార్థ, అర్థ నాటకపదార్థ, పౌరాణిక నాటక పదార్థ బహుమానము లొసంగిన గ్రంథ రాజ మిది.

Vegu-Jukka Office,
BERHAMPORE. 1924.

D. V. Krishna Rao,
*Secretary.*

# తప్పొప్పులు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 12 | 21 | ధనికులకు జ్వరితులకును, | ధనికులకు, జ్వరితులకు, |
| 18 | 11 | వగదు పీవు, | వగుదు వీవు. |
| 18 | 16 | దారిద్ర్యిత వర్ణనము, | దారిద్ర్య వర్ణనము. |
| 19 | 17 | విసర్జించి, | విసర్జించి. |
| 19 | 22 | ధూర్వహుండైన, | ధూర్వహుండైన. |
| 20 | 1 | స్వైరమున, | స్వైరమున. |
| 22 | 5 | ఖలుండుమూత్సర్య, | ఖలుండుమాత్సర్య, |
| 24 | 25 | రక్తమాంసములనిర్బంధించి, | రక్తమాంసముల నిర్బంధించి |
| 25 | 13 | పురుషుడు స్వతంత్రుడై, | స్వతంత్రుడై. |
| 28 | 19 | కువైద్యోపహాసము, | కువైద్యాపహాసము. |
| 34 | 6 | గుటియువేళల | కురియువేళల. |
| 49 | 22 | నవంబుప్రియంబుగనుండునంచులో, | నవంబుప్రియంబు గనుండు నంచెవన్. |
| 73 | 16 | జాలగ్రహింపరాదు, | జాలఁ గ్రహింపరాదు. |
| 85 | 1 | ఆమ్మహావిష్ణువు, | అమ్మహావిష్ణువు. |
| 87 | 9 | భీభత్సరసము, | బీభత్సరసము. |
| 88 | 19 | నిర్ఘరులన్, | నిర్ఝరులన్. |

మఱియు నందందు దోసము లుండవచ్చును. మన్నింపఁ బ్రార్థితులము.



శుభమస్తు

అవిఘ్నమస్తు

శ్రీరామ చంద్రాయనమః

# అ భి న వ భ ర్తృ హ రి

## సు భా షి త ము లు

### సత్యాకృష్ణ సంవాదము

మ॥ "నడురేయిన్ దలుపేల దట్టెదవు?" "కాంతా! మాధవుండన్;" "వసంతుఁడవా?" "చక్రధరుండఁ;" "గుమ్మరివా?" "భూధరుండ;" నయ్యాదిశేషుఁడవో?" "పన్నగ మర్దనుండ;" "విహంగ స్తోమాధినాథుండవా?"
"మదవతీ! నేహరినాడఁ;" "గ్రోఁతివగుదో?" మా రాడఁగాలేక లోఁ దడఁబాటొందుచు మానముంగొని నసత్యానాథుఁగీర్తించెదన్.

(శ్రీకృష్ణుఁ డొకనాఁ డొక గోపికయింటఁ బ్రవేశించి వెన్నభుజించి యామెను మేల్కొలుపఁగా జరిగిన సంవాదము)

చం॥ "ఎవఁడవు?" "కృష్ణుఁడన్;" "భళిర యిప్పుడు రాఁబనియేమి?" "నాగృహంబవునని యెంచివచ్చితిని;" "యట్లగునేని నవనీత భాండమున్ దివియఁగనేల?" "చూచితిని నిండుగనున్నదొ లేదొ యంచు;" "జాణవవుదు; నన్ను మేల్కొలుపనాయమ?" "దొంగలు వత్తురంచు"

అని

గదా?" యని నవ్వియా మోదన • కౌఁగిటఁ జేర్చిన కృష్ణుఁ గొల్చెదన్.

పార్వతీ పరమేశ్వరుల సంవాదము

చం॥ "ఎవఁడవు?" "శూలి;" "వైద్యుఁడ • కేగుము వేగమె;" "నీలకంఠుఁడన్
ఉవిదరో;" "కేకరింపఁగల • వా?" "పశునాథుఁడఁ;" "గొమ్ము లున్న వే?"
"అవునవుస్థాణువందు రనను;" • "నక్కటస్థాణువు మాటలాడు నే?"
"శివుఁడు మగండ"; "చేరి తవ • సీమకు? బో" యనుమాట లేక స్థా
ణువువలె నిల్చి పార్వతిఁ గ • నుంగొను స్థాణువు మమ్ముఁ బ్రోచుతన్.

బ్రహ్మ

చం॥ వదన సరోజముల్ నిగమ • వాఙ్మకరందముఁ బుక్కిలింపఁగా
నుదరము స్వర్ణశైల శిఖ • రోపమితంబయి పండితాళిక
భ్యుదయముగా రహింపఁ మహి • మోన్నతినుండు విరించి నుండు, మా
నుదుట లిఖింప కుండు నెమ • నోజ్ఞ పటుత్వ కవిత్వ తత్వమున్.

సరస్వతి

గీ॥ వనజ భవుని ముఖాంభోజ • వనమునందు
సంతతము సంచరించెడు • సర్వ శుక్ల
హంసి, నాదు మానసమాన • సాంతరమునఁ
గలకలారావ వదనయై • యలరుఁ గాత.

గీ॥ అతుల శబ్దాఘ ప్రియాళి • తాఘపంక,
దేవముని గణోపాసిత • దివ్యలీల,
జలజ జాతాస్య గహ్వర • సంప్రభూత
యగు సరస్వతి దురితంబు • నణచుఁగాత.

గణేశ ధ్యానము

కం॥ మక్కువతోఁ దలిదండ్రులు
ఒక్కమ్మడి ముద్దులాడ • నొగిఁ దన్ముఖముల్

ఒక్కటఁ గలయఁగ నెనుక దాఁ
గ్రక్కునఁ ధనమోముఁ దివియు ♦ గజముఖుఁ గొలుతున్.

ప్రస్తావన

గీ॥ గానమునకు సుభాషిత ♦ జ్ఞానమునకు,
స్త్రీల శృంగార చేష్టావి ♦ శేషములకు,
నెవని చిత్తంబు సంతోష ♦ మొనయకుండు,
వాఁడు యోగీంద్రుఁడో? లేక ♦ పశువొ యగును.

చం॥ అనుభవ మింత యొప్పునె? మ♦హాశయుఁ డింతకు సందియంబు లే
దని పొగడన్ సుభాషితము ♦ లంచు రచించి జగాన ఖ్యాతి కె
క్కిన కవిరాజు భర్తృహరి ♦ కిన్ మును సన్నుతులిచ్చి మెచ్చి కొ
న్న నవిరచింతు నా ఘనుని ♦ నామమునన్ మఱియొండు గ్రంథమున్.

ఉ॥ ప్రేమము మీఱఁ దండ్రి తన ♦ బిడ్డకు రాముని నామమో, సుధా
ధాముని నామమో, యొసఁగి ♦ ధన్యతఁ గాంచు విధాన, నెన్నియో
నామము లెంచి భర్తృహరి ♦ నామ మొసంగితి మత్సుభాషిత
స్తోమము వన్నె కెక్కఁ; నిది ♦ దోసమొ? పండితు లాదరింపరే?

చం॥ మునువిరచించి చన్న కవి ♦ పుంగవులన్ గికురించి, వ్రాయఁజా
లఁ; నయిన నే సుభాషితము ♦ లన్ విరచించెద సంస్కృతాంబునిన్
దనరిన శ్లోకరత్న సము ♦ దాయము ప్రోవున సంగ్రహించి యు
య్యనఘుల కన్న మిన్న నను ♦ స్వాతిశయంబునఁ గా దెలుంగుడీ.

గీ॥ రమ్యకావ్యార వింద మ ♦ రంద పాన
మత్త చిత్త విద్వజ్జన ♦ మధుప సమితి
పర కవుల కీర్తిఁ బొగడుచుఁ ♦ బాడుచుండ
బధిరుఁడై యుండుఁ గా కవి ♦ వసుధ యందు.

మ॥ నవలల్ నాటకముల్ మనోహర కథల్ ♦ నవ్యప్రబంధావళుల్
వివిధంబుల్ విరచించి సత్కవి యశో ♦ విస్ఫూర్తి శోభిల్ల, దు
ష్కవియున్ సత్కవినే నయంచుఁ గృతులన్ ♦ గర్వించి వ్రాయుం గదా!
"శివుఁడున్ ధాండవమాడ నాడవె పిశా ♦ చీ భూత భేతాళముల్"

## మహాజన ప్రశంస

చం॥ పరహితకారియైన జన ♦ వర్యుఁడు తాను నశించుచుండినన్
బరులకు మేలొనర్చును ధ్రువంబుగఁ గీడుఁ దలంపఁడెన్నఁడున్
దరువులకున్ శిరోమణి య ♦ నందగు చందనభూరుహంబు తన్
గరకరిఁ ద్రుంచు గొడ్డలి ము ♦ ఖంబునఁ జల్లదె సౌరభంబులన్.

గీ॥ సంకటములకుఁ జిక్కినన్ ♦ సజ్జనుండు
పరుల కుపకారముం జేయఁ ♦ బాలుపడును;
రాహు ముఖమునఁ జిక్కియు ♦ గ్రహణ వేళ
జనుల పాపంబులన్ బాపుఁ ♦ జంద్రమసుఁడు.

ఉ॥ మాన్యుని గౌరవించి యిల ♦ మాన్యుఁడు సర్వజనంబులందుఁ దా
ధన్యతఁ గాంచు; నట్టి యెడ ♦ ధార్ష్ట్యముఁ జూపును దుర్జనుండు; సౌ
జన్యమునన్ శిరోమణిగఁ ♦ జంద్రుని నీశుఁడు దాల్చియుండ, దౌ
ర్జన్య గుణాభిలాషియగు ♦ రాహువు మ్రింగక మిన్నకుండునే!

కం॥ అపకారి సేయు నపకృతి
కుపకారము సేయువాఁడె ♦ యుర్విన్ ఘనుఁడౌ
నపకారి సేయు నుపకృతి
కపకారము సేయుటెట్టు ♦ లుత్తమ గుణమౌ?

గీ॥ ఆది మధ్యాంతముల యందు ♦ నతుల మైత్రి
యేక రీతిగ నుండు సు ♦ శ్లోకునందు;
తాపనచ్ఛేద ఘర్షణ ♦ తాడనములఁ
గాంచనం బన్య భావంబుఁ ♦ గాంచఁ గలదె?

గీ॥ అహహ ప్రత్యుపకార ని ♦ స్స్పృహతఁ గలిగి
జగతి నదనదీ మేఘ భూ ♦ జములఁ బోలి
భోగములఁ బాసి యితరోప ♦ యోగములకు
సజ్జనంబులు వెచ్చింత్రు ♦ సంపదలను.

చం॥ సుజనుని వక్త్ర పద్మమునఁ ♦ జొచ్చిన దోషము సద్గుణంబగుఁ
గుజన ముఖంబునన్ సుగుణ ♦ కోటి దలంపఁగ దోషపుంజమౌ

క్కజ మగునే? మహాంబుదము ♦ క్షారముఁ జేయుసుధాంబుధారగా
భుజగము పాలుద్రావి విష ♦ మున్ వడిఁగ్రక్కనుదుస్సహంబుగన్.

గీ॥ సంపదలు నాపదలు మహా ♦ జనుని యందు
నప్పు డప్పుడు గన్పట్టు ♦ నొప్పిదముగఁ;
హాని వృద్ధులు చంద్రుని ♦ యందుఁ గాక
సంభవించునె యకట న ♦ క్షత్రములకు.

చం॥ ఖలుఁడు పరార్థ వంచకుఁడు ♦ గావున రంధ్రముఁ జేయు, సద్గుణా
కలనమునన్ బుధుండు ఖల ♦ కల్పిత రంధ్రముఁ గప్పిపుచ్చెడున్;
దొలుతను వాడిసూది మొన ♦ దుష్కర రంధ్రమొనర్చినంత ని
ష్ఫలమగు నొక్కొ? తచ్చరమ ♦ భాగము పొందియుఁ గప్పిపుచ్చదే?
భళిర! నుతింపఁ బోలు గుణ ♦ వంతులు నిత్య పరోపకారకుల్.

ఉ॥ దుష్టుఁడు దుష్ట వక్త్ర గత ♦ దోషమునన్ దనునొవ్వ నాడినన్
భ్రష్టుఁడు గాక పెద్ద దయి ♦ వాఱ మృదూక్తులఁ బల్కు సజ్జనుం
డిష్టుని రీతిగా; నగరు ♦ వృక్షముఁ గాల్చిన హాని యేమి? యు
త్కృష్ట సువాసనల్ సకల ♦ దిక్కులఁ గ్రమ్మ వెలోకుతెన్నఁగన్.

ఉ॥ జన హీనుండు గుణోత్తముండగును స ♦ త్సాంగత్యముంబొంది; దు
ర్జన సాంగత్యమునన్ జనోత్తముడు దు ♦ స్స్వాంతుండు కాఁజాల; దె
ట్లనినన్:- మృత్తిక పూవుచేఁ బరిమళ ♦ వ్యాప్తిన్ గుబాళించుఁ; గా
న్నన యా మృత్తికఁ గూడుఁ గాక నిజగం ♦ ధవ్యాప్తిఁ గోల్పోవునే?

చం॥ "బరువు భరింపలేవు, నిను ♦ వాగెల గట్టిగఁ గట్టి, స్వేచ్ఛగాఁ
దిరిగి సుఖింపనీయరు, మ ♦ దిం దల పెట్టవుగాక నీవు నం
గరముల కేగుచుందు" వని ♦ గాడిద తట్టుని పల్కె నంతనే
తురగముహానముంగొనియెఁ ♦ దుచ్ఛులకున్ జనవీయరుత్తముల్.

గీ॥ పండిత ప్రోక్త పరిహాస ♦ వాక్యములు, శి
లాక్షరంబులు పొందియు ♦ సార్థకములు;
అజ్ఞులగు మూర్ఖులాడు ప్ర ♦ తిజ్ఞ లకట!
సలిల లిఖి తాక్షరంబు ల ♦ శాశ్వతములు.

గీ॥ చెనటితోఁ మైత్రి యొనరించి ♦ చెడుట కంటె
సజ్జనునితోడఁ బోరాడి ♦ చావఁ దగును;
అకట! ఖరరోమహాణాళిశ ♦ యంబుకంటె
సత్తురగ పాదఘాతంబు ♦ చాలమేలు.

గీ॥ పండితుఁడు లేని సభల న ♦ ల్పుండు సైత
మతుల విద్వాంసుఁడై ఖ్యాతి ♦ నందఁ జాలుఁ
దలఁపగ నిరస్తపాద ప ♦ స్థలము నందు
నాముదపుఁజెట్టు వర వృక్ష ♦ మైరహించు.

గీ॥ లోన, సారముంగలిగి య ♦ హీన జనులు
నారికేళోప మానులై ♦ నడచు వారు
ఖలులు పైపై మనోహర ♦ కాంతిఁ గలిగి
బదరికం బోలి యెల్లెడ ♦ వఱలు చుందురు.

గీ॥ పరుల కుపదేశముఁజేయ ♦ వలసె నేని
పండితోత్తము లెల్లబు ♦ వసుధ యందుఁ
బలికి నట్టు లనుష్ఠించు ♦ వారు గలరె ?
నూటికో కోటికో యొక్క ♦ మేటియుండు.

## దుర్జన నింద

కం॥ ఖలునకుఁ గంటకమునకున్
దలఁపన్ బ్రతికారము ద్వివి ♦ ధంబుల నుండున్;
దలసూపకుండఁ జేయుటొ
తొలఁగించుటొ కాకుండ ♦ దూరము గాగన్.

గీ॥ సర్వ సద్గ్రంథములఁ దాను ♦ జదువుఁగాక
దూషణ మొనర్ప కుండడు ♦ దుర్జనుండు;
సర్వ రసముల గ్రహియింపఁ ♦ జాలుఁ గాక
తనివిఁ గనదు వాయస మమే ♦ ధ్యమునఁ గాని.

గీ॥ తొలుత సంజలిం గూర్పుము ♦ దుర్జనునకుఁ,
బిదప సజ్జనునకు మ్రొక్క ♦ వెసల వచ్చు;

వదన పరిశుద్ధికిన్ మున్ను • గుదము శుద్ధి
నాచరింపంగ వలయు న • త్యవసరముగ.

గీ॥ దుష్ట జనవంచితాత్ముండు • శిష్ట జనుని
యెడల సైతము విశ్వాస • హీనుఁ డగును
పాలవేఁడిమి కడలిన • బాలకుండు
"ఫూ" యనుచు నూదుచున్ దధ్య • మును గ్రహించు.

గీ॥ ఎన్ని యుపకారముల నైన • హీన జనుని
జనవరేణ్యునిఁ గావింప • శక్య మగునె ?
తులసి మృత్ తోయ ఫలన పత్రి • యుల గుదంబు
వదన బింబంబుగాఁ జేయ • వచ్చునొక్కొ ?

గీ॥ పాప చిత్తు, సదాచార • వర్తనంబు
ఇతర జనుల కు పద్రవ • హేతువగును;
ఉగ్రి శార్దూల ముపవాస • ముండె నేని
పారణంబు గోమారణ • కారణంబు.

గీ॥ ఆతపంబున సంతప్త • మైన యసుక
కాల్చి పోక్కుంచుఁ జూ పె భా • స్కరుని కంటె;
నధమ జనుఁడయ్యు రాజ ద • త్తాధికారి
నృపుని కంటెను వేధించు • నితర జనుల.

గీ॥ ప్రాణముల ఁ బాసి యైన నీ • చాతినీచుఁ
డన్యుల హితంబునకు విఘ్న • మాచరించు;
నీఁగ యన్నంబునంబడి • యీల్గుఁ గాక
వాంతిఁ బుట్టించు భుజియించు • వాని కకట!

గీ॥ సదుపదేశంబునన్ దుష్ట • హృదయుఁ డకట!
సత్స్వభావంబు వహియింపఁ • జాలఁ డెందు;
బ్రిద్దలం గట్టినం గట్ట • వచ్చుఁ గాక
శునకపుచ్ఛంబు సరళంబుఁ • గనునె? చెపుడి.

## భ్రష్టుఁ డగు భిక్షువునకును సాధువునకును సంవాదము

సీ॥ "భిక్షువా, నీయంగి ♦ బిగిసెఁ, గారణమేమి ?"
"మత్స్యజాలమున న ♦ మ్మాడ్కి-నుండెఁ;"
"నేమేమి! చేపల ♦ నీవు భక్షింతువో ?"
"మద్యంబులేకున్న ♦ మత్స్యమేల ?"
"చోద్యంబుగాఁ దోఁచె ♦ మద్యంబుఁ ద్రావుదో ?"
"ప్రీతిమైఁ గ్రోలెద ♦ వేశ్యతోడ;"
"నాశ్చర్య మహార! వా ♦ రాంగనం గూడెదో !"
"కూడెద శత్రుల ♦ తోడఁ బెనఁగి;"
గీ॥ "దాయలుఁ గలారె ?" "కన్నంబుఁ ♦ ద్రవ్వునపుడు
గృహమునం గలవారు నా ♦ రిపులుగారె;"
"చోరవృత్తికిఁ జొచ్చితే ?"... "♦ జూదమునకుఁ"
"జూద మాడుదే?" "చెడితి; నీ ♦ వాదమేల?"

గీ॥ పూర్ణముగ నుండినఁ దటాక ♦ మును దొలంగి
కాక మర్కట! కుంభోద ♦ కంబుఁ గ్రోలుఁ;
దనకు ననుకూలముగనున్న ♦ దారఁ బాసి
కూళ యేవేళఁ బరకాంతఁ ♦ గూడుచుండు.

గీ॥ సత్కులీనుఁ డొఁ గాక, దు ♦ ర్జనునితోడ
స్నేహమే హేతువున నైనఁ ♦ జేయరాదు
భాగ్య మేడిమిం గలిగినఁ ♦ బొక్కు-లెక్కు-ఁ
జలువఁ గలిగినఁ జేతికి ♦ మలినమంటు.

గీ॥ పరుల దూషింపగా దశ ♦ వదనుఁడగును;
అన్య రంధ్రింబులకు సహ ♦ స్రాక్షుఁ డగును
పరుల సిరి హరింప సహస్ర ♦ బాహుఁ డగును
ఖలుని నీ చాతినీచునిఁ ♦ దలఁపఁ దగునె ?

గీ॥ దుక్కతోకకు ఖలునకు ♦ నొక్కపోల్కి
వసుధ నెల్లఁడుఁ జూడఁ గ ♦ న్పట్టుచుండుఁ;

నిరుపరకుఁ గల వక్రత్వం ♦ హేతు వుసను
గుహ్యము ప్రకాశమయ్యె న ♦ సహ్యముగను.

గీ॥ ఖలుఁడు సకలవిద్యలనేర్చి ♦ యలరుఁగాక
సజ్జనునిఁ బోలి వర్తింపఁ ♦ జాలఁ డెందుఁ
మహిత గంగాజల స్నాన ♦ మాత్రమునను
దలఁపగా నధః కేశంబు ♦ దర్భయగునె ?

గీ॥ ఖలుఁడు గర్వించి దుష్కృత్య ♦ ముల నొనర్చుఁ
నకట! తత్ఫలంబును సాధు ♦ వనుభవించుఁ
నసుర నాథుండు జానకి ♦ నపహరించి
నంత, బంధింపఁ బడియె ర ♦ త్నాకరుండు.

గీ॥ అహహా! యానంద వనికి దా ♦ వాగ్నిఁ బోలు,
శీలశాఖికి సమద శుం ♦ డాలమగును;
జ్ఞాన దీపంబునకుఁ బ్రభం ♦ జనముఁ బోలు,
నరయ శక్యంబె కుజన స ♦ మాగమంబు.

గీ॥ వినుత సద్యశ స్సారభం ♦ బునకు నుల్లి,
శాంతివాః పూరధారకుఁ ♦ జటులవహ్ని,
అమల కారుణ్య సుమసున ♦ కాకసంబు,
సుజన దుఃఖ ప్రదుండగు ♦ కుజనుఁ డకట !

గీ॥ నీచుఁ డా రక్కరంబుల ♦ నేర్చినంత
శ్రీ గళునిఁ గూర్చి బోధింపఁ ♦ జెలఁగుచుండుఁ
నన్న వస్త్రంబులకు మాత్ర ♦ మున్నయంత
నక్కటకట ! కుబేరుని ♦ ధిక్కరించు.

—♦ సుజన కుజన సంవాదము ♦—

ఉ॥ "ఎవ్వడఁ వీ?" "వెలుంగవె ఖ♦లేశ్వరుఁడన్;" "ధృతిఁబూని చొచ్చితే
యివ్వనసీమ?" "నన్ను భుజి♦యించిసుఖింపవె కూరసత్వముల్;"
"ఇవ్విధి నిశ్చయింపఁ దగు♦నే?" "విను మత్తనుమాంస భుక్తిచేఁ

గ్రొవ్వి మృగంబులెల్ల జన • కోటిని మ్రింగుఁగ్రమక్రమంబుగాన్

గీ॥ "వినుఁడు పిశునత్వ మనవద్య • విద్య మాకు,
"జనుల దూషణమే సుభూ • షణము మాకు,
"నన్యదుఃఖమె యతుల సౌ • ఖ్యంబు మాకు,"
ననెడు కుజనుల నాబ్రహ్మ • యవనియందు
శివశివా బుద్ధిలేక సృ • జించెనేమొ?

— • విద్వత్ప్రశంస • —

గీ॥ పండిత పరిశ్రమంబును • పండితుండె
ఱుంగుఁ గాక మూర్ఖుండెట్లె • ఱుంగఁ జాలు?
వంధ్య గ్రహియింపఁజాలునే • ప్రసవ బాధ?
బిడ్డలం గన్న మగువకు • విదితమగును.

గీ॥ తనదు పురవరంబున రాజు • ఘనతఁ గాంచు,
నితరదేశంబులన్ వాని • నెవ్వఁ డడుగుఁ?
బండితుం డెల్ల దిక్కులఁ • బ్రణుతిఁ గాంచు
సాటిగలదె విద్వత్త్వ రా • జత్వములకు.

గీ॥ పండితుఁడు సద్గుణంబును • బ్రస్తుతించు
లోపముండినఁ గంఠంబు • లో నణంచుఁ;
జంద్రు నౌదలధరియించి • శంభుఁ డహాహ!
హాలహాలమును కంఠంబు • నందుఁ బూనె.

గీ॥ ఇభతురగ వాహనములెక్కి • యేగుదెంచు
మూర్ఖుఁ డక్కట! లేమిచే • బుధవరుండు,
పాదచారియౌ; గిరులపై • బకచయంబు,
మెలఁగు; నిసుకపైఁ గలహంస • ములు చరించు.

— • మూర్ఖ వర్ణనము • —

గీ॥ సరససంగీత సాహిత్య • సరణిలేని
హీనజనుఁడు పుచ్ఛవిషాణ • హీనపశువు;

పసరమే మైన గసవేల ♦ మెసఁగఁ దనినఁ
బలుక నేటికిఁ బశువుల ♦ భాగ్యమదియు.
గీ॥ ప్రీతిభయమున్ బ్రజ్ఞయున్ లేని ♦ వాని కకట!
భవ్య కావ్యశాస్త్ర పురాణ ♦ పఠనమేల?
లోకముం జూడఁ గన్నులు ♦ లేకయున్నఁ
గరయుగస్థ దర్పణమునఁ ♦ గార్యమేమి?
సీ॥ వనములం జరియించు ♦ పశ్వాది మృగముల
కతుల ముక్తాఫల ♦ ప్రాప్తియేల ?
బూడిదంబొరలాడు ♦ గాడిదకున్ భూరి
ఘనసారమిళిత సు ♦ గంధమేల ?
అడుగడ్డునకు మార్గ ♦ మడిగి మెల్లగఁబోవు
పుట్టుగ్రుడ్డికి దివ్వెఁ ♦ బట్టనేల ?
సంజ్ఞాభినయములఁ ♦ జరియించి-జీవించు
చెవిటివానికి గాన ♦ శిక్షయేల ?
గీ॥ మోసగానికి ధర్మైక ♦ బోధయేల ?
పరధనాపహారికిఁ దత్వ ♦ వాక్యమేల ?
తనకుఁ దోచక, చెప్పిన, ♦ వినక మెలఁగు
జడునకున్ మూర్ఖునకు సత్ప్రి ♦ సంగమేల?
సీ॥ మంచిచెడ్డలఁ గూర్చి ♦ యించుకంతయు లోన
నెట్టిచింతయు లేక ♦ యెసఁగు వాఁడు,
కలిమిలేముల చొప్పఁ ♦ గలనైనఁ దలఁపక
మించి సర్వంబు భ ♦ క్షించువాఁడు,
తప్పించు నొప్పించు ♦ ముప్పంచు నెంచక
పోద్రిడ చందాన మా ♦ టాడువాఁడు,
సూర్యచంద్రులఁ గంటఁ ♦ జూడఁ జాలనియట్లు
రేవుమాపులను ని ♦ద్రించువాఁడు,
గీ॥ చెవులుగలిగియు వినలేని ♦ చెవిటివాఁడు

కోరి వీక్షింప నోపని ♦ గుడ్డివాఁడు,
మాన మవమానమును లేని ♦ మంచివాఁడు,
దృఢశరీరంబుఁ గలిగి వ ♦ ర్ధిల్లువాఁడు,
మూర్ఖుఁ డెనిమిదిగుణములఁ ♦ బొదలువాఁడు.

—♦ విద్యా ప్రశంస ♦—

ఉ॥ చోరులుదొంగిలింతురన ♦ చున్ భయమొందఁగరాదు, రాజులున్
జేరి హరించువార లని ♦ చింతిలరా దిఁక నర్థభాగమున్
గోరుదు రన్నదమ్ము లని ♦ కొంక గరాదు, భరింప నంతయున్
భార మసంగరా దొసఁగు ♦ వారికి వర్ధిలుచుండు, విద్యయన్
శ్రీరమణిన్ భజింపుఁడని ♦ చెప్పెదఁ జాటెద నెల్లవేళలన్.

చం॥ జనులకు విద్యలేనియెడ ♦ జ్ఞానమువర్ధిల దట్టి విద్యకున్
వినయము లేకయుండిన ♦ లభింపదు గౌరవ మించుకంతయున్;
గనుగొన నందముంగలిగి ♦ కమ్మనివాసన లేకయున్నఁ గ్రొ
న్నన నొకమాచ కమ్మయయి ♦ నన్ దలఁదాల్పఁగనుత్సహించునే.

మ॥ వినినన్, జూచిన, నేర్చినన్ జనులకున్ ♦ విజ్ఞాన ముప్పొంగు; నూ
తన బుద్ధిన్ వికసింపఁజేయుఁ; దమమున్ ♦ ధ్వంసంబుఁగావించు, న
జ్జనహృద్వీధి లతాకృతిన్ సుకృతి పు ♦ ష్పస్ఫూర్తి శోభిల్లు, దు
ర్జనులన్ జేర్చదు, విద్య యిట్టి దనఁగా ♦ శక్యంబె యూహింపుఁడీ.

— ధనము —

సీ॥ భక్తవిద్వేషము, జడాను ♦ భవముఁ గలుగుఁ,
జూడ గురులఘు నంబున ♦ సురుచియొసఁగు,
వక్త్రిమునఁ గటుకత్వంబు ♦ పరిఢవిల్లు,
ధనికులకు జ్వరితులకును భే ♦ దంబుగలదె?

గీ॥ జపతపోవయో వృద్ధులు ♦ జ్ఞానవృద్ధు
లాశకున్ బద్ధులై "జగ ♦ దీశ" యనుచుఁ
"జిత్తము ప్రభూత్తమా" యంచు ♦ సిగ్గులేక
ద్వారపాలకులైయుంద్రు ♦ ధనికునింట.

గీ॥ రమ్యతరకీర్తి సాంద్ర! శ్రీ ♦ రామచంద్ర!
ధనముఁ బడయుము, కార్య సా ♦ ధనము ధనముః
"ధనము సృష్టిమూలం" బంద్రు ♦ తత్వవిదులుః
ధనరహితునకు మృతున కం ♦ తరముగలదె?

గీ॥ ఎవఁడు ధనికుఁడో యాతఁడే ♦ సృష్టియందు
నార్యవర్యుండు ఘనుఁడు బ్ర ♦ హ్మఘ్నుఁడయ్యుఁ
జంద్రతుల్య సద్వంశ సం ♦ జాతుఁడేని
వ్యర్థజీవియై నశియించు ♦ నిర్ధనుండు.

గీ॥ కనక మాహాత్మ్య మెఱుఁగ నె ♦ వ్వనితరంబు?
నామ సామ్యంబు వలన ను ♦ న్మత్తకుజము
చెలఁగి మతి విభ్రమంబు సృ ♦ జించుచుండెఁ,
గనకమా! నీకిదే నమః ♦ స్కారశతము.

గీ॥ కామినులయందు వెండియుఁ ♦ గనకమునను
విహిత మనియెంచి సంభ్రమ ♦ విభ్రమముల
రెండువిధములఁ బెట్టి వి ♦ రించనుండు;
వాని గెలువఁ జాలినవాఁడు ♦ భర్గుఁడగును.

గీ॥ ధనకనకవస్తువాహన ♦ తతుల సతుల
వైభవోపేతుఁడయ్యుఁ, దా ♦ ప్రాజ్ఞుఁడేని
సూదిమొనయంత ధనమైనఁ ♦ జూపఁదగడు
మానియు భ్రమించు దర్శన ♦ మాత్రమునను.

గీ॥ కనుల వీక్షింపనీయక ♦ కనుఁజెఱచుఁ
జెవుల నాలింపనీయకఁ ♦ జెవుడుఁ దెచ్చుఁ
బలుకనీయక యొకమూఁగ ♦ వానిఁ జేయు
వింతగ శరీరమున లేని ♦ వికృతిఁ బెట్టు.
క్ష్మాప! యతుల సంపదోగ్ర ♦ మహిమమద్ది.

గీ॥ 'హాయిఁగూర్చు గంజాయి సా ♦ రాయి' యంచుఁ
ద్రావుదురు మూఢజనములు ♦ ధనముఁ బాసి

మైమఱపు సౌఖ్య మేర్పైన ♦ మానవునకు
ద్రవిణముంబోలు మదపదా ♦ర్థంబుగలదె?

గీ॥ దుందుభి యచేత నంబయ్యెఁ♦ గుందుచుండ
ఘన ధనారావములను ది ♦ క్తటములదరఁ;
జేతనుండైన మానవ ♦ శ్రేష్ఠుఁడెవఁడు
ధనముఁ గాంక్షింప కుండునీ ♦ ధరణియందు.

గీ॥ ధనము నార్జింపు మెంతైన; ♦ దాచవలదు;
అనుభవింపు; మొసంగుము ♦ త్యాగమనుచు
నేమి శాశ్వత మీజగ ♦ త్సృష్టియందు?
వాయు విలులితదీపమీ ♦ యాయువనఘ.

—:సుకవి ప్రశంస:—

గీ॥ సత్కవి రచించు కావ్యంబు ♦ సజ్జనుండు
గాంచి పఠియించి పొగడఁ శ్లా ♦ ఘింపుచుండు
పృథివి[నొండు వృక్షంబు పు ♦ ష్పించినంత
మారుతంబు భరించుఁ ద♦త్సౌరభంబు.

గీ॥ పరుని హృదయంబునను నాటి ♦ సరసగతిని
శీఘ్రముగ శీర్షమల్లాడఁ ♦ జేయకున్నఁ
గవి రచించినయట్టి యా ♦ కావ్యమేల?
వీరుఁ డభ్యసించిన ధను ♦ ర్విద్యయేల?

గీ॥ అకట! యపశబ్దభయము సుం ♦ తైనలేక
వృత్తభంగంబుఁ దలఁపక ♦ విశ్రమంబుఁ
దొఱఁగి, యర్థక్షయంబు లో ♦ నరయకుండ
గుకవియు విటుండుఁ జరియింతు ♦ రుతలము

గీ॥ సత్కవీంద్రుని సత్కావ్య ♦ సరణిఁజూచి
దోషములను నన్వేషించు ♦ దుర్జనుండు;
సొంపుగానున్న కాయంబుఁ ♦ జూడకుండ
నెలమి వ్రణములఁ గాంక్షించు ♦ నీఁగఁబోలి.

ఉ॥ బమ్మ! లిఖింపుమా పదల ♦ ఫాలతలంబున నెన్నియేని, నా
సమ్మతినిచ్చెదన్ నవర[illegible] ♦ సప్రచురంబగు గద్య పద్య కా
వ్యమ్ము రచింపఁజాలుకవి ♦ వర్యుఁడు మూర్ఖుని పజ్జ సత్కవి
త్వమ్ము పఠించునట్టి దుర ♦ వస్థ ఘటింపకుమయ్య మ్రొక్కెదన్.

—: దాతృ ప్రశంస: —

చం॥ శివశివ యేమిచెప్పఁదగుఁ; ♦ జెప్పక తప్పఁదు:—సిగ్గులేని మా
నవులు, సమస్త కాంక్షల ఘ ♦ నంబుగ దీర్చు భవత్పదంబులన్
దవులక రాజుఁగొల్చిపద ♦ దాసులమంచుఁ జరింతురి; కామ ధే
నువుఁ ద్యజియించి పాలకయి ♦ న్యూనఖరంబును జేరుకైవడిన్.

చం॥ కరకరిఁ దిట్టినన్ మఱియు ♦ గట్టిగఁ గొట్టినఁగారఁబెట్టినన్
సిరులనొసంగు వాఁడు నృప ♦ శేఖరుఁడంచు భజించు దుర్జనుం
డరమరలేక గాండ్రిమని ♦ యార్చుచు గెంటుచుఁదన్నుచుండినన్
బరమ పదద్వయంబునను; ♦ చాకలి గాడిదఁ జేరునక్కటా!

—: తేజస్వి ప్రశంస: —

గీ॥ సత్వ సంపన్నుఁడైన తే ♦ జస్వియెపుడు
వయసుఁ జూడడు వాని స్వ భావమదియు;
కొదమ సింగంబు శిశువయ్యు ♦ మదగజంబు
కుంభముంజీల్పఁ జెలఁగు సం ♦ రంభమునను.

సీ॥ కుశఁబోలునంకుశ ♦ వశమయ్యె మదహస్తి,
హస్తియంతటిదానె ♦ యంకుశంబు?
పవిధారకుంగొండ ♦ వ్రక్కలై భువిఁగూలు,
నద్రియంతటిదె వ ♦ జ్రాయుధంబు?
చిన్నదివ్వెకుఁజిమ్మ ♦ చీకటినశియించుఁ,
జిమ్మచీకటికి దీ ♦ పమ్ము సరియె?
ఒక్క వేటున వృక్ష ♦ మొఱగి నేలంగూలు;
గొడ్డలి, వృక్షంబు ♦ కొలఁదిఁగలదె?

సీ॥ కడప యంతేటి గుమ్మడి ♦ కాయచాల
యలంత్రియగుఁ జిన్న కత్తికి ♦ నైన ననుచు
నార్యులు వచించు లోకోక్తి ♦ యనృతమగునె?
లావుగానున్న సరియౌనె ♦ చేవకేమి?

—:ఉదార ప్రశంస:—

గీ॥ ఒకని హస్తంబు మీఁదయి ♦ యుండుకతన
నొకని హస్తంబు క్రిందయి ♦ యుండుకతన
దాత యాచకులం గల ♦ తారతమ్య
మెల్లఱకు నెట్టిదో తేట ♦ తెల్లమయ్యె.

గీ॥ ఇతరులకు దానమిచ్చుచుఁ ♦ దృప్తిదీఱ
ననుభవించిన ధనము నీ ♦ యదియ యగును
ధనము ఘనముగాఁ రక్షింపఁ ♦ దలఁచితేని
చేలపైఁ గట్టఁబడు బొమ్మఁ ♦ బోలెదీవు.

గీ॥ దాత ఖలుఁడయ్యు సేవింపఁ ♦ దగినవాఁడు
ఖలుని విత్తంబునాశించి ♦ కొలువఁదగదు;
జలముఁ గాంక్షించు పథికుండు ♦ జలధిఁబాసి
చెలువుదరి కేగుచున్నవాఁ ♦ డెఱుగవొక్కొ?

చం॥ జనులనుతింప నంగవిభు ♦ చర్మము చే, శిబిమాంసరాశి చే
దినమణి తుల్య తేజుఁడు ద ♦ ధీచిమునీంద్రుఁ డొసంగునస్థిచేఁ
దనరిన దానకన్యకకు ♦ ధారుణి జీవనమిచ్చె మేఘుఁ, డో
దనమిడియేలఁ జాలునొక ♦ దాత కలిం గనుపట్టఁ డక్కటా

—:ధీర ప్రశంస:—

శా॥ నీతిజ్ఞుల్ గని శ్లాఘనీయమనుచున్ ♦ మేలెంచినన్ లేకనిం
దా తాత్పర్యములాడినన్, గలిమియున్ ♦ రాకుండినన్ లేక సం
ప్రీతిన్ వచ్చిన, ఘోరమృత్యు వపుడో ♦ వేయేండ్లకో గల్గినన్
ఖ్యాతుల్ ధీరులు న్యాయమార్గమదుగై ♦ నన్ దప్ప రెప్పట్టునన్.

—గుణప్రశంస—

గీ॥ సుగుణి సర్వజ్ఞునింబోలి ♦ నెగడఁగాక
యాశ్రియము లేకరాణింపఁ ♦ డశ్రియముగ;
నవ్యమాణిక్య మెంత య ♦ నర్ఘమైన
నభిలషించును గాదె హే ♦ మాశ్రయంబు.

సీ॥ సుగుణమణిగణఖనియైన ♦ సుజనుఁడెప్పుడు
సుగుణవంతుని మైత్రికి ♦ సొక్కి-సోలుఁ;
బద్మసాంగత్యముం గోరు ♦ బంభరంబు;
పొంతఁగల భేక మామైత్రిఁ ♦ బొందఁగలదె?

చం॥ గుణసహితుండు కష్టములఁ ♦ గుందిన,నాతని కుంచు కీర్తి కా
రణమగు; నెప్పుడున్ సుఖప ♦ రంపర తామర తంపరయ్యు స
ద్గుణరహితుండు నిక్కముగ ♦ దుర్యశమున్ వహియించు; స్వేచ్ఛకు
ల్బణముగఁ గూయు కాకమును ♦ పంజరబద్ధశుకంబుఁ జూడుడి.

గీ॥ నరుఁడు సుగుణంబు వలన నౌ ♦ న్నత్య మొందు
నున్న తాసనమున నున్న ♦ నెన్నఁ బడునె?
అహహ! ప్రాసాద శిఖరరో ♦ హణము వలన
గరుఁడుని ంబోలఁ జాలునే ♦ కాక మెందు?

గీ॥ సుగుణ ముండిన నీవు పూ ♦ జ్యుండ వగుదు,
రమ్య వేష భాషా డంబ ♦ రంబు వలదు;
గణ గణారావకృత్ ఘంటఁ ♦ గట్టినంత
గొడ్డు వోయిన యావుఁ గ్రై ♦ కొందు రొక్కొ?"

—సంతోష ప్రశంస—

గీ॥ గర్భమున నీవు నివసించు ♦ కాలమునను
జీవనంబుఁ గల్పించిన ♦ సృష్టి కర్త
నేడు నిద్రించునో లేక ♦ నిహతుఁడగునో?
శేషవృత్తి విధింపడే ♦ చింతయేల?"

గీ॥ అధిక భోగంబు లాశించి ♦ యాశ్రయింతు

వుదరపోషణచ్ఛలమున • నుర్వీపతుల;
నక్కటా! చీమయేరాజు • నాశ్రియించె?
గూటికై, యింతకాతరం • బేటి కనఘ?.

గీ॥ హరునకుం దప్ప దంద్రుకు • ర్మానుభవము
చక్రిపరివర్తనముఁ బోలి • సంభవించు
నతుల సుఖదుఃఖ నిచయము • ప్రార్థితంబు;
తల్లడిల్లంగ నేటికి • దైన్యమునను.

గీ॥ ధనమె మైశ్వర్యమని యాత్మఁ • దలఁపవలదు?
సత్యసాంగత్య, మతుల పాం • డిత్య, మతుల
వంశజన్మ, మారోగ్యము, • బడయు మనఘ!
తగిన మైశ్వర్యవంతుఁడ • వగదు వీవు.

గీ॥ ఒకనిఁ బ్రార్థింపకుండుట • యుత్తమంబు
అదియ సౌఖ్యంబు; గౌరవం • బదియ, యదియ
కీర్తిహేతు; వుత్సాహ వి • స్ఫూర్తియదియ;
అదియ, యధికార; మధిక సం • పదయు నదియ.

—• దారిద్ర్య వర్ణనము •—

గీ॥ లోకులను జూచుచున్నాఁడ; • లోకులందు
నొక్కఁడున్ నన్ను వీక్షింప • నోపఁ డహాహా!
త్వత్ప్రసాదంబునన్ ధన్య • తముఁడ నైతి
వినుము, దారిద్ర్యమా! నిన్ను • వినుతిసేతు.

గీ॥ కలిమిఁ గలవాఁడు ఘనదాత • గాకయున్న
కలిమిలేనివాఁడు తపస్వి • కాకయున్నఁ
జెలఁగి యిరువురి మెడలకు • శిలలు గట్టి
కూపమునఁ గూలఁద్రోసినఁ • బాపమున్నె?

గీ॥ మరణ దారిద్ర్యములలోన • మరణమొండు
చాల సౌఖ్యప్రదంబగు • జనుల కెందు,

మరణ మల్పకాల క్లేశ ♦ మరసిచూడ,
ఘోరదారిద్ర్య మతి దుఃఖ ♦ కారణంబు.

గీ॥ ధనము ఘనముగ నార్జించు ♦ ధనికునకును
శత్రువైన నొకప్పుడు ♦ మిత్రుఁ డగును;
ధనము నార్జింపఁజాలని ♦ జనుని మొదలఁ
బరుని చందానఁ జరియించు ♦ స్వజనుఁడకట.

శా॥ "జానే! బాలకునైనఁ గైకొనుము, లే ♦ దా వేగమాచింపి గు
డ్డైనన్ దె" మ్మనుభర్తఁజూచి సతి "నా♦థా రిక్తభూమిస్థలిన్
నే నిద్రించితి; నేమిసేతు?" ననినన్ ♦ విత్తాపహారార్థియై
యానా డచ్చటికేగు దొంగ వినిహా♦హా యంచు దుఃఖించుచున్
దానం బిచ్చి తొలంగె నన్యగృహాల ♦ బ్ధంబైన సద్వస్త్రమున్.

మ॥ మునుమా తాతల వారి తండ్రులమొయిన్♦బాల్యంబె నీవల్వ;మ
జ్జనకుం డంగమునన్ ధరించెనొక భూ♦పందాల్పుచందానఁ గొ
న్నినమాడ్కిన్ధరియింతుదీని నెపుడున్;♦నా పుత్రులున్ మన్మలున్
మునిమన్మల్ వరుసన్ ధరింపవలెఁబో♦మఃపాద్రిద్దులన్ దైవమా.

మ॥ తలఁపంబోలు భవద్వివేక మహాహా ♦ దారిద్ర్యమా! సర్వ వి
ద్యల రాజిల్లెడువాని సర్వసుగుణ ♦ స్థైర్యున్ విసర్జించి మూ
ర్ఖుల నన్యాయ పథప్రవర్తకుల నూ ♦ రుంబేరు లేనట్టి వా
రల యంచున్ వరియింపవెన్నఁడును నీ ♦ ప్రఖ్యాతిఁగీర్తించెదన్.

—♦ యాచక నింద ♦—

చం॥ అకట! తృణంబుకంటె లఘు♦వైనది తూలము,దానికంటె యా
చకుఁడతి హీనుఁడయ్యె; సుమ♦సౌరభ ధూర్వహుఁడైన గంధవా
హకుఁడు గ్రహింపఁడేటికని♦యాత్మఁదలంచెద రేని వాని లే
మికి భయమొందకుండిన ని♦మేషములోన వహింప కేగునే?.

చం॥ కరమును జాచి నంతనె, ము ♦ ఖంబు కడుంగడు వాడినంతనే,
నరములతోడ దేహము వ ♦ ణంకిన యంతనె, ఖిన్నగద్గద

స్వరమున దీనవాక్యములను ♦ బల్కనయంతనె, యర్థిఁజూచి, దా
స్వీకారముఁబొందు రోగియని ♦ మందులొసంగకుమా భిషగ్వరా!

గీ॥ కలసివర్తింపఁగాకి కా ♦ కవఁను బిల్చు,
యాచకుఁడు యాచకునిఁ జూచి ♦ యాగ్రహించు;
యాచకుఁడు యాచకుని శత్రు ♦ వనగ వినమె;
యాచకునికంటెఁ గాక మ ♦ త్య లఘు వమ్యె.

గీ॥ ఒకని యాచింపకుండుటే ♦ యుత్తమంబు;
కరముఁ జాచినఁబోవుఁ బో ♦ గౌరవంబు;
శ్రీపతియు నాఁడు బలిని యా ♦ చించు తఱిని
వామనాకారముం దాల్ప ♦ వలసెఁగాదె?.

గీ॥ సంతతి జనించు ననుచు యా ♦ చకుఁడు జంకి
భార్యఁగూడఁడు ధనికుఁబలె సతంబు,
నూలుపోగునఁ గుత్తుకం ♦ దుర్గించుపగిది
వెన్నెలం గాల్పవలెఁగాదె ♦ విధి గృహంబు.

మ॥ ధళిరా! ధాత! సమస్తయాచకులతో ♦ వైరంబు నీకేల? మా
నులకున్ శాశ్వత జీవనంబొసఁగి, క ♦ ర్ణున్ విక్రమార్కున్ శిబిన్
బలిరాజేంద్రుని ముంజ భోజనృపులన్ ♦ బ్రఖ్యాతులన్ గీర్తనీ
యుల సుశ్రీయుత దానశౌండుల గతా ♦ యుష్మంతులన్ జేసితే?.

గీ॥ దేహియని యుచ్చరించిన ♦ దేహిఁ బాసి
ధృతియుఁ గీర్తియు బుద్ధియు ♦ హ్రీయు శ్రీయు
ననఁగ నొప్పారు దేవత ♦ లాక్షణంబ
యేడకో కానరాకుండ ♦ నేగుచుండు.

గీ॥ మానవంతుఁ డొకం డతి ♦ దీనదశను
యాచకుండయ్యె; "దేహి"యన్ ♦ నీచమైన
వాక్యనకుఁబ్రాణమునకు వి ♦ వాద మొదవె
వదనమును మున్ను విడువంగఁ ♦ ద్వరితగతిని.

సీ॥ యాచకుని ప్రాణములు "దేహి" ♦ యనెడు వాక్యం
తోడ నెడలో వెడలు మా ♦ రాడకుండ;
నంతట "దదామి" యని దాత ♦ యనిన యంతఁ
బ్రాణములు సొచ్చుఁ గర్ణ రం ♦ ధ్రములనుండి.
గీ॥ లజ్జ వలదని వెనుకకు ♦ లాగుచుండ
నాశ యాచింపఁ బెరరేపు ♦ నక్కటకట;
యాచకుని చిత్త మెవ్వల ♦ యట్టులయ్యెః
వాని దురవస్థ వారించు ♦ వాఁడు గలఁడె?.
గీ॥ హస్తముంజాచి దేహి యం ♦ చడుగుకంటెఁ
నాలుకం దుగ్రించినం జాల ♦ మేలుగాదె?
యాచకా యింత వంతేటి ♦ కడవి కేగి
యాపరాత్పరు ధ్యానింపు ♦ మాత్మయందు.

—♦ కృపణ నింద ♦—

ఉ॥ దానమొసంగు వాఁడనని ♦ దంభములన్ బచరించు దాత మొ
త్తేని ధనంబు యాచకుల ♦ కిచ్చిన నేమగు దాఁచినట్లు; తా
నైనను ముట్టకుండ ధన ♦ మంతయుఁ గూరిచి యంత్యవేళకున్
దేన లోసంగు తేఁటి పగి ♦ దిఁక గృపణుండు సమస్తమిచ్చుఁదాఁ
గానియుఁ గొంచునేగఁడు, జ♦గన్నుతుఁ డెవ్వఁడు? నిశ్చయింపుఁడీ.
గీ॥ ధనము ఘనముగ భావించి ♦ తనసుఖంబు
విడిచి రక్షించులోభి వి ♦ వేకియగునె?
పరులకై కష్టల భరించు ♦ వానిపగిదిఁ
గష్టభాజనుండగును ని ♦ క్కంబువినుఁడు.
చం॥ చిఱుతలు తిండిలేక తన♦చెంతను కుందు నవస్థకక్కటా
బిరబిర నేగుదెంచు సతి♦వెక్కసముం గని యోర్వఁజాలమిన్
గరమును జాచి "దేహి" యను ♦ కష్టములోభి యెఱింగెనేని తా
నటమఁటిఁబొమ్మపొమ్మనును♦యాచకునిన్ నిరసించు వాక్కులన్.

చం॥ ధనికునిఁజూచి యర్థిఁ కవి ♦ తాపటువై ఖరిఁజూపనాతఁడున్
వినుమనుచున్ పఠించెను క ♦ విత్వము; శ్లోకములన్ బఠించినం
తనె పఠియించెశ్లోకములు; ♦ దాతవటంచు నుతింప నాతఁడున్
గనిగినుతించె నర్థిచనఁ ♦ గన్ దలవాంచె నమస్కరించుచున్.

గీ॥ ఖలుఁడు మూత్సర్య ముడుగని ♦ కరణి, లోభి
ధనము విడువడు; విడుచు జీ ♦ వనమ్మునైన;
క్షౌద్రముండేటి చందానఁ ♦ గట్టకడకుఁ
జోరులకు భూమిపతులకుఁ ♦ జాఱవిచ్చు.

గీ॥ చర్మమిచ్చిన కర్ణుని ♦ సన్నుతింతు
మాంసమిచ్చిన శిబికి న ♦ మస్కరింతు
ఎమ్ముసంగిన జడదారి ♦ నెన్నుచుందు
విత్తముం గోరకున్న లో ♦ భియునొసంగుఁ
బ్రాణములనైనఁ జర్చాదు ♦ లడుగనేల?

—♦ కలి మహిమ ♦—

చం॥ పరకులజుల్ హితుల్, స్వజన ♦ వర్యులువైరు, లధర్మకర్మత
త్పరులు నితాంతవైభవులు, ♦ పాపులు భూపులు, సూరులైనన
త్పురుషులు దుఃఖభాజనులు, ♦దుష్టులు రాజసభాధికారులు,
త్తరచరితుల్ దరిద్రు, లుచి♦తజ్ఞులు, మానులు, వృద్ధులెల్లరున్
స్థిరులు, సుపుత్రికుల్ విగత ♦ జీవులు, దుష్కలి నేమి చెప్పుదున్.

గీ॥ వక్త్రము నశించెఁబరవిత్త ♦ భక్షణమున
దానము గ్రహించి హస్తంబు ♦ దగ్ధమయ్యె
హృదయ మపవిత్రమై పర ♦ స్త్రీలఁజేరె
విప్రులకు శాపశక్తి యె ♦ ట్లొదవు?

సీ॥ పృథివి నిరోషధి ♦ వెండియు నిర్వీర్య,
నీతినిర్ణయపతుల్ ♦ నీచమతులు,
జనపతుల్ నిజకర్మ ♦ సద్ధర్మరహితులు,
బ్రాహ్మణులతుల దు ♦ ర్మార్గరతులు,

భర్తృవిరోధిని ♦ పరరతకులకాంత,
పితృజన విద్వేష ♦ యుతులు సుతులు,
వర్తకానృతమార్గ ♦ వర్తనుల్ వైశ్యులు,
శూద్రులు వంచనా ♦ క్షుద్రమతులు,
గీ॥ పాపభూయిష్ఠమయ్యెఁ బ్ర ♦ పంచమెల్లఁ,
కలియుగంబున జీవింపఁ ♦ గష్టతరము -
చనినవారలె ధన్యులు ♦ జగతియందు
ధర్మదేవత యేగెఁ గాం ♦ తారమునకు.
సీ॥ సౌహార్ద మనునది ♦ శశశృంగ ముంబోలు
సుజనత వంధ్యా ప్ర ♦ సూతిఁబోలుఁ
బ్రణుతసద్గుణ గణ ♦ గ్రహణపారీణత
యూహింప వ్యోమసూ ♦ నోపమంబు
సదసద్వివేకంబు ♦ నరఁదలంపఁగ రాదు
దృష్టిశీలంబుల ♦ మృతవిషములు
ఆశ్రిత గౌరవం ♦ బాత్మప్రయోజనా
పేక్షాయుతంబు సౌ ♦ ఖ్యక్షయంబు॥
గీ॥ ఉల్లము మరందలిప్త ఖ ♦ డ్గోపమితము;
పుడమిజేడుల చందంబు ♦ నుడువరాదు;
కలియుగము సొంపుఁగలనైనఁ ♦ దలఁపవలదు;
లోకమంతయు నక్కటా ♦ శోకమయము.
సీ॥ ఐశ్వర్యమనునది ♦ యతివ పిఱుఁదు లంద,
ధైర్యమన్నది దొంగ ♦ తనమునంద,
దాతృత్వమనునది ♦ తమగృహంబులయంద,
శౌర్యంబుబలహీన ♦ జనులయంద,
ఔదార్యమనునది ♦ యమితవాక్కులయంద,
జ్ఞాన మత్యంత భో ♦ జనమునంద;

మగతనంబన్నది ♦ మగువఁగూడుటయుండ,
సత్యమన్నదిద్యూత ♦ సభలయుండ,
గీ॥ కరుణయనునది యాత్మీయ ♦ గాత్రిమందః
గానఁబడుఁగాని మఱివేఱ ♦ గానరాదు;
హీనమై లోకమతుల శ్మ ♦ శానమయ్యె;
గలియుగముసొంపుఁ గాన్నైనఁ ♦ దలఁప వలదు.

—:తృష్ణానింద:—

గీ॥ ఆశయను కాంతకున్ దాసుఁ ♦ డైనవాఁడు
ధరిణిఁగల యెల్లజనుఁ బాద ♦ దాసుఁడగును
ఆశ యెవ్వానికిన్ దాసి ♦ యైతనర్చు
జగతి యంతయువాని దా ♦ స్యముననుండు.

గీ॥ అమిత శాఖోపశాఖల ♦ నలముకొనిన
యాశయను నట్టి భూమిరు ♦ హంబునెక్కి
హృదయమను మర్కటము సంచ ♦ రించుచుండె;
ఫలము భక్షింప నెందుఁ గ ♦ న్పట్టదకట!.

మ॥ కనులన్ విప్పి జగంబుఁజూడనకటా ♦ కన్పట్టదెప్పట్టునన్
వినరాదించుకయున్, శిరోరుహములున్ ♦ వెల్వెల్లఁబాఱెన్, వడిన్
జనఁగాళ్లాడవు, డుల్లెఁబో దశనముల్, ♦ చర్మంబు శుష్కించె, నై
నను నన్ బాయక యెప్పుడున్ గొలుచుతృ ♦ ష్ణా సాధ్విఁగీర్తించెదన్.

చం॥ కనుఁగొనఁ గొండభూరుహము ♦ కంటెనుగొప్పది, దానిమించెఁబో
వననిధి, దానికంటెను న ♦ భంబు కడుంగడుమిన్న, దానిక
న్నను బరికింప బ్రహ్మము ఘ ♦ నంబననొప్పును, దానికంటెనో
యనఘ దురాశయున్నది మ ♦ హత్తరమంచు మదిందలంచెదన్.

మ॥ జర, వ్యాఘ్రింబలె నాదుయావనదశన్ ♦ సర్వంబు భక్షించె, దు
ర్భరరోగంబులు రక్తమాంసముల ని ♦ ర్బంధించి భంజించె, నన్
హరియింపన్ దలపెట్టె మృత్యువు; మదీ ♦ యాశామహాదేవి, హా!
నిరపాయంబుగఁ గ్రాలుచున్నదిగదా ♦ నిర్నిద్రయై, ప్రౌఢయై.

— దైవము —

గీ॥ విద్యయున్ బౌరుషంబు లా ◆ భింప దేవ్రడు
దైవము ఫలించు నంతటఁ ◆ దథ్యమిదియు;
అబ్ధి మథనావసరమున ◆ హాలహలము
హరునకు లభించె శౌరికిఁ సిరిలభించె.

మ॥ దరిద్రిణాత్మోద్భవుఁగాంచి దుర్భరమహా ◆ దారిద్ర్యముం బాపగన్
గవితన్, యాచన, సేవ, నన్యవసతిన్, ◆ గాంధర్వ విద్యన్, వివా
హ విధిన్ గూడితి నేవ్రరన్ సతులఁ; వం ◆ ధ్యాత్వంబునన్ గాన్పసం
భవము య్యెన్; లభియించు నేఫలము, దై ◆ వంబన్యమూహించినన్.

మ॥ తడఁబాటేటికరక్షితుండ ననుచున్ ◆ దైవంబుగాకన్యుఁడౌ
వ్వఁడునిన్ బ్రోచును; బంధుమిత్రజనులున్ ◆ వైద్యుల్ ప్రయత్నించినన్
గడకున్ దైవసహాయ హీనుఁడయి రో ◆ గ గ్రస్తుఁడై యుండు; న
య్యడవిన్ గాపురముండువాఁడు సుఖియౌ ◆ నాత్మన్ విచారింపుమా.

గీ॥ పురుషుఁడు స్వతంత్రుఁడై కర్మ ◆ ముల నొనర్చుఁ;
దైవవశమునఁ దాఁబ్రమాదమునుఁ బొందు;
స్వాతిశయమున భూమిా రు ◆ హంబు నెక్కు
వాఁడు, దైవయోగంబునన్ ◆ బడక యున్నె?

గీ॥ శిరము జడమాటఁ గాబోలు ◆ శ్రీగళుండు
దుర్లిపి లిఖించు కరములఁ ◆ దునుమకుండ
నజుని శిరమును ఖండించె ◆ వ్యర్థముగను;
అనుచితంబంచు నూహింతు ◆ నాత్మయందు.

— ఉద్యోగ ప్రశంస —

గీ॥ తనదు జన్మ ప్రభృతిఁ బాలుఁ ◆ ద్రావుచుండు
పిల్లికెచటైన గోవు ల ◆ భించె నొకొ?
ఉద్యమంబునఁ గాదె జ ◆ నోత్తముండు
కార్యసాఫల్యముం బొంది ◆ ఘనతఁగాంచు.

గీ॥ కార్యసాఫల్య ముద్యోగ ♦ కలనఁగాక
తనకుఁగల మనోరథము మా ♦ త్రమున నగునె?,
నిజగుహాంతర సీమను ♦ నిదురవ్రాపు
హరిముఖంబునఁ బడునె యే ♦ హరిణమైన?.

చం॥ పురుషవరుండు దైవమును♦బుద్ధిఁదలంపక తా మహోద్యమం
బరసి యొనర్చెనేని తన ♦ యంతన సంపద వచ్చిచేరుః ఁగా
పురుషుఁడు దైవముం దలఁచి ♦ మున్నొనరింపఁడు పౌరుషంబు; నే
త్తఱివయినన్ గృతోద్యమము♦తప్పినఁ దప్పును నష్టముండునే?.

గీ॥ పౌరుష మొనర్చి పిదప దై ♦ వమున్న నమ్మ
యుంట సస్యంబునకు వాన ♦ వంటిదగును,
అట్లుగాకున్నఁ జేరుఁ బ ♦ ద్మాగ్రజాత;
కమల యుద్యోగిఁ బ్రేమించి ♦ కరముఁ బట్టు.

గీ॥ కలిమిఁ గాంక్షించి తా దురా ♦ శలకుఁబోక
అలుపమును బెంపు గావింప♦ వలయుఁ జూవె
ఉన్నదానిని భోగించి ♦ మిన్నకుంట
విత్తనంబుల భక్షించు ♦ విధముగాదె?.

—♦ పరగృహ వాసము ♦—

గీ॥ యౌవనంబున దారిద్ర్య ♦ మధిక కష్ట
మమిత కష్టంబు మూర్ఖత్వ ♦ మంతకంటెఁ
బరుల యన్నంబుఁ బరగృహ ♦ వాస మకట
కష్టతరమని వచియింతు ♦ స్పష్టముగను.

—♦ ఋ ణ ము ♦—

గీ॥ పాపము, ఋణంబుఁ గావింపఁ ♦ బౌలుపడుదు
రాదిసుఖముగఁ గన్పట్టు ♦ నల్పమతికిఁ;
బెంపు సొంపు సర్వంబు న ♦ శింపఁజేయు
రెంటి పరిణామ మూహింప ♦ మృత్యు సమము.

—♦ కర్మము ♦—

చం॥ కలిమి గృహంబునందుఁబశు♦కాండము గోష్ఠమునందునుండుఁ; భ్రా
తలుఁగులజుల్ సుతుల్ పరిచి♦తపరిజయున్ బితృభూమినుండుఁ; తా
వలచిన భార్యయున్ గృహము♦ద్వారమునన్ విలపించు; మేను ప్ర
జ్వలితచితిన్ నశించు, నెడ♦ఁబాయక కర్మమువచ్చు నాత్మతోన్.

గీ॥ వేనవేలుగ గుమిఁగూడు ♦ ధేనువులను
వత్స తనతల్లి వెన్నంటి ♦ వచ్చు పగిదిఁ
బూర్వకృత మైన కర్మంబు ♦ భూమియందు
ననుభవింపఁగఁగర్తను ♦ ననుగమించు.

చం॥ వనమున నున్న ఘోర రిపు♦వహ్నుల మధ్యమునందు నున్న, దు
ర్గనులకుఁ జిక్కియున్న, జల ♦ రాశి మునింగిన, నద్రిమస్తకం
బున నివసించినన్, నిదురఁ ♦ బోవుచునుండిన, సంకట స్థితిన్
వనరిన,ఁ దాఁబ్రమత్తుడయి♦నన్ గృతపుణ్యము ప్రోచు నెత్తఱిన్.

గీ॥ ఆపదలయందు దుఃఖించి ♦ యణఁగి మణఁగి
సంపదలవేళ గర్వించి ♦ సంతసింప
నేటికి? "భవితవ్యం భవ ♦ త్యేవ"యనుచుఁ
గర్మమును నమ్మికొనియుంట ♦ ధర్మమనఘ.

—: ఉదర పూరణము :—

ఉ॥ స్వాంతమునన్ హితా హిత వి ♦ చారము నుంతయు లేక వేదసి
ద్ధాంత కళాతిరస్కృత ప ♦ థంబునఁబోవుచు, భోజనార్థియై
సంతతమున్ నిజోదరముఁ ♦ జక్కఁగనింపుచు, సంచరింపుచున్
సంతసమొందు నన్నరుని ♦ నైచ్యము నేమనవచ్చుఁ జెప్పుఁడీ.

గీ॥ కడుపులను నింపుకొనుటకు దుం ♦ దుడుకుతోడఁ
బండితులు చేయఁజాలని ♦ పనులు గలవె?
ప్రతిగృహమునందు భారతిన్ ♦ వానరమును
జేసి యాడించుచుందురు ♦ సిగ్గులేక.

—:మహానస సుఖము:—

సీ॥ అజ్ఞాతాచ్ఛాదనంబు, స్వా ♦ యత్తగుణము,
అబ్జసంభవదత్త ♦ మహాభరణము,
మహానసమనునది పండిత ♦ మ్మన్యతతికి
మహిత విద్యావిశేష స ♦ మాజములను.

సీ॥ వర్షముల వేళఁ గాటలం ♦ బాడవహహా
కోకిలమ! గ్రహించితినీదు ♦ లౌకికంబు
దర్దురంబులు వక్తలౌ ♦ తరుణమునను
మౌనముంబూనుటయ్యది ♦ మండనంబు.

సీ॥ దర్దురాహ్వాయ కుకవులు ♦ దుర్దినమున
సంతటఁ దెలంగి* బెక బెక ♦ లాడు వేళ
గోకిలాహ్వాయ సుకవీంద్రు ♦ కోటికకట
పలుకకుండుట యయ్యది ♦ భద్రమగును.

—:వ్యాకరణజ్ఞుల స్తుతినింద:—

కం॥ భీతిలి వైయాకరణకి
రాతున కపశబ్దవనచ ♦ రవ్రితతి, భిష
గ్జ్యోతిర్నటవిటగాయక
జాతానన గహ్వరముల ♦ శరణముఁగోరెన్.

—వైద్యోపహాసము—

సీ॥ అక్కటా! వైద్యరాజ! య ♦ మాగ్రజాత
మనుజులెల్లను నీకు న ♦ మస్కరింత్రు
ప్రాణముల మాత్రమును యముం ♦ డపహరించు
ధనముఁ బ్రాణంబుల హరించు ♦ ఘనుఁడవీవు.

మ॥ పరకాంతాకుచమండలద్వయపరి ♦ ష్వంగంబు ప్రాప్తింప, దు
ర్భరసంభోగరుజాపనోదము మిషన్ ♦ వారాంగనాగేహ సం
చరణశ్రీ లభియింపఁగన్ గపట వే ♦ షంబూని, ధాత్రిన్ భిష
గ్వరసంజ్ఞన్ జరియించుచుందువు ధన ♦ ప్రాణాపహారార్థివై.

—:గ్రంథాది ప్రశంస:—

ఉ॥ పండితహీన భూపతి స ♦ భన్, శ్రుతిహీనముఖంబు, జ్యోతిష
జ్ఞుండును లేని పోఁరిలు,నృప ♦ శూన్య పురంబును, శౌరిసత్కథా
కాండము లేని కావ్యమును, ♦ జ్ఞానము లేని గురున్ సుబుద్ధి మం
తుండు త్యజించుటొప్పుఁ గుల ♦ దూషితభార్యను బాసినట్లుగన్.

—:లక్ష్మీ స్వభావము:—

ఉ॥ కావ్యవిధిజ్ఞుఁ బండితునిఁ ♦ గైకొన, వాణిసవత్నియౌను; వై
ధవ్యముఁ గూర్చు శూరుఁబడ ♦ దన్నద; నన్నువరించి పేదకున్
దర్పము సంగుపారూపమునఁ ♦ దార్చును దాతను గాఁగిలింప; న
న్నవ్యయరాగసంపద న ♦ హర్నిశమున్ గనుబోధి గూడెదన్.

మ॥ "విమలాంభోనిధి పుత్రివయ్యు నకటా♦విద్వాంసులం బాయుట నా
యమె? మూర్ఖు వరియింప నీకుఁ♦దగునే?" "యాలింపుమా
హేతువు
కుమతీ! పండితవర్యు నెవ్వఁడయినన్♦గొండాడి పోషించుఁ బా
పము!! మూర్ఖుంగని యాదరించి భువి నె♦వ్వాడైనఁ బోషించునే.

గీ॥ మాంద్య, మంగనాసక్తమా ♦ ప్రమానసంబు,
జన్మభూమి వాత్సల్యంబు, ♦ సంతసంబు,
భయ, మనారోగ్య, మధికనం ♦ పదలఁబడయు
వాంఛఁగలవాని కీయారు ♦ బాధకములు.

ఉ॥ హాలహలంబు ఘోరవిష ♦ మంచుఁదలంతురు మూఢులెల్లఁ బూ
శ్రీలలనాలలామమె గ ♦ రిష్ఠవిషంబగు నిశ్చయంబుగన్;
హాలహలంబుఁ ద్రావియు న♦హర్నిశమున్ శశిమౌళి మేల్కొనున్
శ్రీలలనన్ భరించి హరి ♦ నిత్యము నిద్రిలుచుండు వారిధిన్.

—:లక్ష్మీదేవి భర్తతోఁ జెప్పుచున్నది:—

చం॥ పుడిసిటఁ బట్టి తండ్రినొక ♦ భూసురవర్యుఁడు మ్రింగె, నాథ! నీ
వెడఁదయురంబుఁ దన్నెనొక ♦ విప్రవరేణ్యుఁడు, నంతఁబోక మె

వ్వాడుఁ దమమోహములం దెలమిఁ ♦ బూనిచరింతురు నాదువైరిణీ,
గడువడి నాగ్రహంబు శితి♦కంఠుని పూజకుఁ దుర్గించుచుండు, రె
వ్వడువున ఖేదమున్ విడిచి ♦ బ్రాహ్మణ గేహములన్ వసించెదన్.
చం॥ కటకట! యీనముద్రుఁడను ♦ కంప రవంతయులేక పుత్రికన్
కుటిలపురాణ పూరుషున ♦ కుఁ గయికొమ్మని పెండ్లిఁజేసెఁ జీ
కటిపడినంత యాచపల ♦ కామిని యాత్మగృహంబుఁబాసి యె
చ్చటనయినన్ రహస్యముగ ♦ సంచరియించిన దోసమున్న దే?

—:సత్సంగతి:—

గీ॥ సజ్జనునిమైత్రి వలన న ♦ సజ్జనునకు
సాధ్యమగునెట్టి కార్యమ ♦ సాధ్యమయ్యు;
సరసిజముఁ గూడి శంభుని ♦ శిరమునెక్కి
చంద్రబింబంబుఁ జుంబించె ♦ షట్పదంబు.
గీ॥ వికచమల్లికంగూడి పి ♦ పీలికంబు
స్త్రీశిరోమండనంబునఁ ♦ జెలువుమీఱె;
నహాహా! సుమనః ప్రతిష్ఠిత ♦ మైన శిలయు
ధరణి జనపూజితంబైన ♦ దైవమయ్యె.
గీ॥ కల్పవల్లి సంకల్పిత ♦ కాంక్షఁదీర్చుఁ
గామధేను వొసంగును ♦ కామితంబుఁ
జింతితంబుఁ జింతామణి ♦ సంతరించు
సజ్జనులమైత్రి యఖిలంబు ♦ సంఘటించు.
గీ॥ సుజన సంసర్గముంబొంది ♦ కుజనుఁడైన
బుద్ధినౌన్నత్య ముంబొందు; ♦ వీధిఁబోవు
జలము, జాహ్నవిం గూడిన ♦ సాగరమున
సంగమించును గాదె నిస్సంశయముగ.
గీ॥ చిలుక గోమాంసభక్షకు ♦ నిలయముననుఁ
దుష్టవాక్యంబులంబల్కు ♦ స్పష్టముగను;

ఉత్తముని మందిరంబున • నుండునేని
నెపుడు సద్వాక్యములఁ బల్కుఁ; • హేతువేమి?.

—:స్థాన మాహాత్మ్యము:—

గీ॥ స్థానబలమున నత్యల్ప • మైనజీవి
బలయుతంబగు జీవిని • పరిభవించు;
నీట నక్రంబు మదవుటే • నికనుబట్టుఁ
గుక్కఁదుంజిక్కు నాతావుఁ • దక్కనేని.

గీ॥ కుస్థలంబునుఁ జేరినఁ • గోవిదుండు
బడుగులకుఁ జిక్కిపీడింపఁ • బడునుజూవె;
ఇనుముఁగూడిన కారణం • బునను గాదె
సమ్మెటల వ్రేటులకుఁజిక్కి • జ్వలనుఁడకట!.

గీ॥ ఆశ్రయవశంబునంగాదె • యఖిలజనులుఁ
గాంచుచుందురు లాఘవ • గౌరవముల,
వింధ్యమున వింధ్యముంబోలి • పెంపుఁగనిన
గజము దర్పణంబునను లా • ఘవముఁగనియె.

సీ॥ హరియు, శాస్త్రంబు, శస్త్రంబు, • నరుఁడు, వీణ,
అతివయును, వాణి, పాత్రియో • గ్యతనుబట్టి
గౌరవమునైన లేక లా • ఘవమునైనఁ
బడయుఁ గలవంచు బుధవరుల్ • పలుకుచుంద్రు.

—:జిహ్వా:—

గీ॥ నాలుకా! నీకు మ్రొక్కెదన్ • సంతతంబుఁ
బరులనిందించి పాపంబుఁ • బడయుకంటె
"నోమ్ నమశ్శివాయ" యనంగ • నొప్పుమీఱు
ప్రణవ మంత్రంబుఁబఠియింప • రాదెచెప్పుమ?.

గీ॥ సర్వరుచుల గ్రహింపఁగఁ • జాలుదీవు
ఈవు చదువఁ జాలని గ్రంథ • మెందుగలదు?

రామనామంబు నంగల • రమ్యరుచుల
సంగ్రహింపుము శుభము మో • క్షమ్ముఁ గొమ్ము.

—మనస్సు—

గీ॥ అకట మనసు నపుంసక • మని వచింపఁ
దథ్యమనుకొంటిఁ గాని కాం • తలను వెంబ
డించి దుశ్శాంతమచట్టఁ గ్రీ • డించుచుండెఁ
బాశిని మునీంద్రి! వంచింపఁ • బడితి మేము.

గీ॥ హృదయకృతమైన పాపంబు • నెన్నఁదగును
కేవల శరీరకృతము ల • క్షింపఁ దగదు;
సతినిఁ గౌఁగిలించెను మేను • సుతనుఁ గౌఁగి
లించుకొనుచున్న దీభావ • మెంచవలదె?

గీ॥ కూప నిపతితపశువు సం • తాపమునను
పాదముల గింజుకొనుచుండు • బయలు వెడలఁ;
మనమ! సంసార సాగర • మునను బడియు
యత్నముం జేయవు తరింప • నక్కటకట.

—• పశ్చాత్తాపము •—

గీ॥ కలిమిఁ గలవాఁడనని యెంచి • గర్వినైతి
లేమి ఘటియిల్లె విధి నిప్పు • డేమనందు?
పతన ముత్సేక మూహింప • వసుధయందుఁ
గరనిహత కందుకంబని • యరయవలయు.

శా॥ మిథ్యామథ్యల విశ్వసించి మనుజన్ • మెప్పించి మెప్పొంద, స
ద్రిథ్యంబోవక, సందులన్ మెలఁగి యా • రాటంబులన్ గుందితిన్;
తథ్యంబై యమృతంబునైన హరిపా • దద్వంద్వ కంజాతమున్
నధ్యాతవ్యముగాఁ దలంచెనుగదా • నాచిత్త మున్మత్తమై.

సీ. అజ్ఞాన జనిత మౌ • ఢ్యంబుచేఁ గాలంబు
బాల్యంబునన్ గొంత • వ్యర్థమయ్యె

ఈహావనోద్రేక మ ♦ దాంధ్యంబునన్ నింపు
ప్రాయ మంత గాఁ దృణ ♦ ప్రాయమయ్యె
నాశ, మున్ బరువిడ ♦ నాత్మ నెన్న, కుంభోవ
మధ్యకాలం బిట్లు ♦ పొందగించె;
ధనబలంబులు క్షీణ ♦ దశ నొందె నను భీతి
వార్ధకంబున మేను ♦ వణఁకుచుండె;
గీ॥ మోహవశమున, మనసు సం ♦ దేహమునను
ఆర్యనిర్దిష్ట మార్గంబు ♦ నరయ కుండె;
నదిగొ "ఆఁ" యని వదన గ ♦ హ్వరముఁదెఱచి
మ్రింగుటకు వేచియున్నది ♦ మృత్యువకట.
గీ॥ ఒకఁడు దుఃఖింపఁ జింతించి ♦ యూరకుంటి;
నొకఁడు సుఖియింప వీక్షించి ♦ యోర్వకుంటి;
సుఖమనఁగ నేమొ యెఱుఁగక, ♦ శోకనిహత
గాత్రమునఁ దల్లడిల్లితిఁ ♦ గట్టకడకు.
గీ॥ రోగములకును సంసార ♦ భోగములకు
జన్మమంతయు వెచ్చించి ♦ జడుఁడ నైతి;
భూరి చింతామణిం గాచ ♦ మూల్యమునకు
విక్రయించితి నవివేక ♦ మాక్రమింప.

— ♦ గృహస్థాశ్రమము ♦ —

సీ॥ ఆత్మీయసదనంబు ♦ సానందముగనున్న,
సుతులు విద్వన్నుత ♦ సుమతులైన,
సచ్ఛీల యై భార్య ♦ సాధుభాషిణియైన,
ఘనులయ్యు మిత్రులు ♦ ధనికులైనఁ,
బరకాంతయెడ మాతృ ♦ భావంబుఁ గలిగినఁ,
దగురీతి నతిథి స ♦ త్కారమున్న,
శిష్టులు వినుతింప ♦ శివపూజనంబున్న-
మృష్టాన్నపాన సం ♦ తు

గీ॥ భటులు తనయాజ్ఞఁ బాలించు ♦ వారలైన,
నీతిఁగలిగిన, సద్ధర్మ ♦ నిష్ఠయున్న,
సత్యనిరతియు, సుజనసాం ♦ గత్యమున్న,
నశ్రమంబగు నాగృహ ♦ స్థాశ్రమంబు.

సీ॥ చీటికిమాటికి ♦ శిశువు లేడ్చుచునున్నఁ,
గుఱియు వేళల గృహం ♦ బుఱియుచున్న,
సంగణం బమిత పం ♦ కావృతంబుగనున్న,
మత్కుణా భూయిష్ఠ ♦ మంచమున్న,
సెగకుఁదోడుగ నింటఁ ♦ బొగనిండుకొనియున్న,
భక్షింప నన్నంబు ♦ రూక్షమైన,
దుశ్శీలయై భార్య ♦ దుర్భాషిణియు నైనఁ,
బ్రభువు సంతతముఁ గో ♦ పనుఁడునైన,

గీ॥ సతము శీతలజలమున ♦ స్నానమున్న,
శత్రులకుఁదోడు ధనహీన ♦ మిత్రులున్న,
దుష్టులంగూడి సుతుఁడతి ♦ కష్టుఁడైన,
యముని మందిర మాగృహ ♦ స్థాశ్రమంబు.

గీ॥ ధర్మసంపాదితార్థ మా ♦ త్రమునఁ దృప్తి
నంది, తత్త్వ విజ్ఞానియై, ♦ యతిథులందుఁ
బ్రియతముండయి, శాస్త్ర వి ♦ వేకి యగుచు
సత్యము వచించు గేస్తు మో ♦ క్షమునుబొందు.

ఉ॥ పాకనిమిత్త మాత్మ కుల ♦ భామిని వస్తుచయంబు లేమికిన్,
వ్యాకుల మొంది పుత్త్రికలఁ ♦ బజ్జకుఁ బంపకయున్నఁ దత్వ ని
ద్వ్యాకలనన్ రహించు, గుణి ♦ యై వినుతింగొను, స్వస్థలంబునన్
బ్రాకటకీర్తిఁ బొందుఁ, బెర ♦ వారల లోపము లెన్నుచుండు, లౌ
కికకులీనుఁ డుత్తమ గృ ♦ హస్థుఁడనంగఁ దనర్చు భూస్థలిన్.

—♦ ముదిమి ♦—

గీ॥ యమునిఁబోలె దండధరుఁడయి ♦ యలరుచుండు,

హరి విధాన గదాన్వితుఁ ♦ డయి తనర్చు,
శివుని గతి విరూపాక్షుఁడై ♦ చెలగుచుండు,
ముదిమిఁ గలవానిఁ బూజించి ♦ మ్రొక్కవలయు.

గీ॥ "జ్ఞానసంపదఁ గలిగిన ♦ జనుఁడవయ్యు
జీవితంబునఁ బుణ్యంబుఁ ♦ జేయవైతి"
వనుచుఁగోపించి గద్దించి ♦ యముఁడు కాల
దండమున దుల్లఁగొట్టెఁబో ♦ దంతములను.

గీ॥ శ్వాసకాస రోగాది సే ♦ నాసమూహ
ములఁ బురస్కరించి స్వతంత్ర ♦ ముగను వచ్చు
మరణ నృపునకు ధవళ చా ♦ మరముఁబోలు
ముదిమి యేటికిఁ? గాటికిం ♦ బోవుఁగాక.

—♦ సంసారము ♦—

గీ॥ సార మిసుమంత లేని సం ♦ సారమునను
సారవంతంబుగాఁ దోచు ♦ శ్వశుర గృహము;
హరుఁడు హిమపర్వతంబున, ♦ నంబుజాక్షుఁ
డంబునిధిఁ బండుకొను; హేతు ♦ వరయవలదె.

గీ॥ సారమిసుమంత లేని సం ♦ సారమునను
శిష్టజనుల స్నేహంబుఁ, గా ♦ శీనివాస,
మతుల గంగాజలస్నాన, ♦ మలికనేత్రు
నర్చనయు, సారవంతంబు ♦ లండ్రు బుధులు.

మ॥ ఒకచోఁ బండిత బృందగోష్ఠి, మధుపా ♦ నోన్మత్తవాగ్వాద మిం
కొకచో, సానుల యాటపాట లొకచో, ♦ నోయోర నాక్రందనం
బొకచో వృద్ధవిరక్తి, కాముకుల మో ♦ హోద్రేక మింకొక్కచో
నకటా! సంసరణానురక్తి సుధయో ♦ హాలాహలజ్వాలయో.

—: కాలము :—

ఉ॥ ఉత్తమమైన స్థానమున ♦ నుండిన, దవ్వుగనున్న, నెట్టి దు
ర్వృత్తియు లేకయున్నఁ, బృథి ♦ వింగల ప్రాణిచయంబు కాలమన్

మిత్రిక్షిశక్తుల వారినిధి ♦ విమానములున్ దివిఁబత్తులున్ మహా
పత్తులఁ బొందుచున్న వ్యాపా ♦ పట్టునఁ గీడొనరింప వేరికిన్.

ఉ॥ నేలను మించినట్లు పృథి ♦ విం బ్రిజ సంచరియించు, నంతలో
నోలి గతించు, లెక్కలోకఁ ♦ దుందును, వెండి యనేకులుందురీ
లీలనహర్నిశాత్త యుగ ♦ ళిన్ బ్రిజఁబన్నిదమొద్దుచున్ మహా
కాలుఁడు కాళిత్తోడను జ ♦ గత్ఫలకంబున జూదమాడెడున్.

చం॥ చిరముగ నున్నయట్లలరు ♦ సృష్టికి నాథుఁడెవండెఱుంగ మ
స్థిరమగు నిజగద్విపుల ♦ జీర్ణకుటీర వికీర్ణ సద్గుణా
కర నర రత్నరాశులను ♦ కాలుఁడు దాచుచునున్నవాఁడు భీ
కరమగు నాస్యగహ్వరముఁ ♦ గల్గిన మృత్యుసముద్గకంబునన్.

సీ॥ భానుకిరణంబులకుఁ బండఁ ♦ బాఱు భూత
ఫలగణంబు, జగజ్జీర్ణ ♦ వనమునుండి
ఎత్తుకొనిపోయి కాలంబు ♦ తృప్తిఁదీఱ
భక్షణము సేయుచున్నది ♦ వ్యాఘ్రిమట్టుల.

సీ॥ ఘుం ఘుమారావకృద్వ్యాఘ్రత ♦ సంఘ మశక
ధూర్వహోజఁండఫల గణో ♦ దుంబరంబుఁ
బతనశీలంబుఁ గాలంబు ♦ మతినెఱుంగ
నలవియే యెట్టివారికి ♦ నైన నవఘు.

సీ॥ అజుఁడుఁ గల్పాంతమున నాశ ♦ మందుచుండు,
హరియు హరియింపఁబడుచుండు, ♦ నభవుఁడైన
భవుఁడుఁ దుదకు నభావంబుఁ ♦ బడయుచుండుఁ,
గాలమహిమంబు నెఱుఁగ శ ♦ క్యంబె మనకు.

సీ॥ కార్ధిఁ బాషాణములుఁ దేలి ♦ పడవలయ్యె,
నరుఁడు నరమాంస భక్షులన్ ♦ జంపె, యుద్ధ
కార్యభారంబు వహియించెఁ ♦ గపిచయంబు,
కాల వక్రిస్థితి గ్రహింపఁ ♦ గలమె మనము.

—: క్షమ :—

సీ॥ కుటిలభావంబు హాలమున ♦ కున్ ఖలునకు
సహజమగుఁ దన్మ్రిఖాక్షేప ♦ సహనమునకు
క్షమయె తగియుండుఁజూవె, ని ♦ స్సంశయముగ
రమ్యతర కీర్తి సాంద్ర! శ్రీ ♦ రామచంద్ర!

గీ॥ అరయ నరునకు రూపంబె ♦ యాభరణము
అట్టిరూపంబునకు గుణ ♦ మాభరణము
అతుల సుగుణంబునకు జ్ఞాన ♦ మాభరణము
అట్టిజ్ఞానంబునకు క్షమ ♦ యాభరణము.

—: క్షుధ (ఆఁకలి) :—

చం॥ నునువలిపంపు వల్వయు, వి♦నూతనశయ్యయుఁ, గప్పురంపుఁ జం
దనము, మనోజ్ఞహాస్యము,మ♦నంబును రంజిలఁజేయు కాంతయున్,
వినితలయూపఁ గైతయును♦ వీణెయు, నాకటఁ దూలిపోవున,
వ్వనజలకేళి కిన్నియును♦మానెడు బియ్యమునన్ రహించెడున్

గీ॥ ఉన్నవానికిఁ బెట్టువాఁ ♦ డున్నవాఁడు
"అన్నమో రామచంద్రుఁడా" ♦ యంచు నఱచి,
ఆఁకటం దూలిపోలెడు ♦ యాచకునకుఁ
బట్టెడన్నముఁ బెట్టెడు ♦ వాఁడులేఁడు.

ఉ॥ గడ్డియుఁ జిక్కనన్ మెసఁగి ♦ కమ్మని కూటిఁగుండు పేదపై,
బెడ్డలఁగొట్టి, లౌకికుల ♦ విందని పేరిడి, యున్నవారికిన్
లడ్డుజిలేబి దూదిపెడ ♦ లన్ ఫలపుష్ప రసాయనంబులన్
దొడ్డగఁబెట్టు నాజనుని ♦ దూఁబఱఁజూచిన లచ్చియోర్చునే?.

గీ॥ క్రోధముండినఁజాలు శ ♦ తృత్వమేల?
బాధకు దురాశయే చాలు ♦ వ్యాధియేల?
కడుపునిండినఁజాలు భో ♦ గంబులేల?
ఆఁకలియె చాలు దుఃఖింప ♦ నాధి యేల?.

ఉ॥ నీకుఁగలట్టి సర్వమును ♦ నీతియు నోరుపు భోగశాలియుఁ

దేకడఁ జూడరాదు, మది ♦ నెట్టి విచారము లేకయుండు, వా
హా! కడికూడు లేదనుచు ♦ నక్కట! యాచక! కుందనేల? పె
ల్లాకటఁ దూలి సోలునపు ♦ డాదట దైవ మొసంగకుండునే?

—: స్వభావము :—

ఉ॥ దెమ్మొడఁబాసి మూర్ఖుఁడు శ్రుతిస్మృతి శాస్త్రములన్ బురాణ కా
వ్యమ్ముల నాటకంబుల న ♦ హర్నిశమున్ బఠియించినంతనే
ఇమ్ముగ సత్స్వభావము వ ♦ హించునె? యారయ నుల్లిగడ్డ,గం
ధమ్మునఁ బచ్చకప్పురము ♦ నన్ విడనాడునె నైజవాసనన్.

సీ॥ మంచియున్ జెడ్డయు స్వభావ ♦ మాత్రముననె
సంఘటిల్లుఁబో చదువున ♦ సంఘటిలదు
అత్తరువుఁ బూసినంతనె ♦ యక్కజముగ
మోదుగుంబూవు కెందమ్మిఁ ♦ బోలఁగలదె?

—: జీవిత సాఫల్యము :—

సీ॥ ఎవని వాక్యంబు రసవంత ♦ మెవని భార్య
సతియు సత్పుత్రవతియొ, నే ♦ జనుని లక్ష్మి
సంతతము దానవతియొ, నా ♦ జనుని జీవి
తంబు సార్థకమగు నండ్రు ♦ తత్త్వవిదులు.

—: పరోపకృతి :—

గీ॥ పరుల కుపకారముం జేయఁ ♦ బాలుపడని
వాని జీవితం బకట ని ♦ ష్ఫలము గాదె?
కసవు మెసఁగిన నేమయ్యెఁ ♦ బసర మహహా!
చర్మమాత్రాన నుపకృతి ♦ సలుపుచుండె.

గీ॥ కాయ ముపకారమునఁ గాదె ♦ ఘనత కెక్కు,
శ్రవణము రహించు హరికథా ♦ శ్రవణమునను,
కరము రాజిలుఁ గరము త్యా ♦ గంబువలన,
నవ్య గంధకుండల కంక ♦ ణంబు లేల?

—♦ బ్రహ్మ లిఖితము ♦—

సీ॥ వసుధఁ గరీరంబు ♦ పత్రిహీనంబైన
నది వసంతుని దోస ♦ మనఁగఁ దగునె?
గూబ, దివాంధమై ♦ గొందిలో నణఁగిన
నది భాస్కరుని దోస ♦ మనఁగఁ దగునె?
చాతక ముఖమున ♦ జలధార పడకున్న
నదియు మేఘుని దోస ♦ మనఁగఁ దగునె?
హైమ కుసుమంబు పూవున ♦ మోదంబు లేకున్న
నది గంధవహు దోస ♦ మనఁగఁ దగునె?

గీ॥ సర్వ కుసుమంబులం గూడి ♦ సంభ్రమించి
గంధఫలిఁ జేరకున్నఁ ♦ బు ♦ మ్మంధయంబు,
ఎవని దోసంబుగా నది ♦ మొంచవలయు?
బ్రహ్మ లిఖితంబుఁ దప్పింప ♦ వలనుపడునె?.

గీ॥ రూపవంతుని యాలు, కు ♦ రూపురాలు;
రూపహీనుని భార్య సు ♦ రూపసదన;
ఇరువురకుఁ జక్కఁదనమున్న ♦ సిరులు సున్న;
చిత్రములు! పద్మగర్భుని ♦ చేష్టితములు.

గీ॥ ఇతర కర్మ ఫలంబుల ♦ నెన్నియేని
నబ్జసంభవ! వి లిఖింపు ♦ మనుభవింతు;
విరసునకు మత్కవిత్వ ని ♦ వేదనంబు
వ్రాయకుము వ్రాయకుము నాదు ♦ ఫాలమునను.

—♦ అఘటితఘటన ♦—

గీ॥ తామ్రధరంబున వల్లిక ♦ సంభవించు;
సంభవింపదు వల్లికన్ ♦ తామ్రధరంబు;
అహహా!! విపరీతముగ నిప్పు ♦ డంబుజాక్షి!
కనక లతయందుఁ గన్పట్టె ♦ తామ్రధ్రియుగము.

గీ॥ కమలములఁ గమలోత్పత్తి ♦ గలుగునో కో?

యెంచుఁ బ్రశ్నించు సతిఁ గాంచి ♦ యనియె నొకఁడు;
"అతివ ! నీ ముఖాంభోజంబు ♦ నందు సతము
రాజిలుంగాదె యిందీవ ♦ రద్వయంబు".

— ♦ అసంభవము ♦ —

గీ॥ ఎలమి మృగతృష్ణ యను నదిన్ ♦ జలకమాడి,
గగన కుసుమంబుఁ దల మాని ♦ కముగఁ దాల్చి,
అహా హా !! శశశృంగ ధన్వియై ♦ యజుని గెల్వ
నదిగొ వచ్చుచున్నాఁడు వం ♦ ధ్యాసుతుండు.

— ♦ ప్రవాసము ♦ —

గీ॥ సంతతముఁ బ్రవాసంబు క ♦ ష్టంబయగుచు;
అందుఁ బర గేహ వాస మ ♦ త్యనేకకష్ట,
మల్పజన సేవయున్ గష్ట ♦ మంతకంటె;
నింక ధనహీనతా కష్ట ♦ మెట్టిదగునొ ?.

శా॥ ఆకించన్యము హెచ్చినన్, బరిచయం♦బత్యంతమైనన్ గడున్
శోకించున్ సతి గౌరవింపదెపుడున్;♦క్షోణీశు సేవింప నా
లోకింపన్ భయమొందెనే నలసుఁడౌ♦లోకంబునన్; గూప మం
డూకంబట్లు ప్రవాసహీనుఁ డయినన్♦మూర్ఖుఁడగున్ భూస్థలిన్.

గీ॥ ఎవఁడు పరదేశ సంచర ♦ ణేచ్ఛలేక
నిజ వధూముఖా లోకన ♦ నిరతుఁ డగుచు
నెపుడు వ్యాపారహీనుఁడై ♦ యింటనుండు,
వాఁడు ధనహీనతా దుఃఖ ♦ భాజనుఁడగు.

— ♦ సేవక నింద ♦ —

శా॥ భక్షింపన్ బడబాగ్నిఁబోలు, శయనిం♦పన్ గుంభకర్ణుం డగున్,
వీక్షింపన్ విన గ్రుడ్డియున్, బధిరుఁడౌ,♦నేవేళఁ బర్వోత్త హా
ర్యక్షుంబౌ,నని నక్కయౌఁ, బను లొన♦ర్చన్ ఖంజుఁడౌ, నేడ్వఁగా
దక్షుండౌఁ, బ్రభు విట్టి సేవకునిచే ♦ ధన్యుండు గాకుండునే ?.

గీ॥ నమ్రుఁడై యుండుఁ దొలుత నౌ ♦ న్నత్యమునకు,

బ్రిదుకుఁ గాక్షించి విడుచుఁ బో ♦ ప్రాణములను,
అధిక దుఃఖంబులొందు సౌ ♦ ఖ్యములఁ బడయు
సేవకుని మించు మూఢుండు ♦ సృష్టిఁ గలఁడె ?.

గీ॥ వ్యాధితుఁడు, దరిద్రుఁడు, ప్ర ♦ వాసి, ఖలుఁడు,
రాజసేవకుఁ డీయేవు ♦ రీ జగాన
వ్యర్థజీవులు జీవచ్ఛ ♦ వంబులనుచు
వ్యాసుఁడు వచించెఁ బండితుల్ ♦ ప్రస్తుతింప.

గీ॥ పృథ్వి, సేవాశ్వవృత్తులన్ ♦ రెంటిలోన
శునకవృత్తియె స్వేచ్ఛకు ♦ ఘనత కెక్క;
శీర్షమును విక్రయించిన ♦ సేవకుండు
స్వేచ్ఛగఁ జరించు కుక్కకు ♦ నెందు సరియె ?,

—♦ వాగ్వైభవము ♦—

గీ॥ ఎవఁడు సతతంబు వాక్పటు ♦ త్వాకృతినిఁ బరుల
హితుల, నహితుల, ఖలులఁ, బం ♦ డితులఁ, గవుల,
స్వాంతముల సమాకర్షింప ♦ శక్తిఁ బడయు
నతఁడె సభలందు భాషింప ♦ నర్హుఁ డగును.

—♦ వాగ్మి ప్రశంస ♦—

గీ॥ అల్ప శబ్ద మాత్రంబున ♦ నధికమైన
యర్థము స్ఫురింప భాషించు ♦ నతఁడె వాగ్మి;
అధిక వచనంబు సారమ ♦ త్యల్పముగను
వెడలఁబుచ్చెడు వాఁడె పో ♦ విప్రలాపి.

—: అసత్యవాది నింద :—

గీ॥ పురుషవరునకు నొకటి, పా ♦ మునకు రెండు,
అజునకున్ నాలు, గాఖు ష ♦ డాననునకు,
ననలునకు నేడు, పది రావ ♦ ణాసురునకు,

శేషునకు రెండువేలంబుఁ ♦ జిహ్వ లహహా !!
ఖలున కెన్నియో లెక్కింప ♦ వలను పడునె ?.

—: కృతఘ్న నింద :—

సీ॥ భోజనముఁ జేసి వచ్చిన ♦ భూసురునకు
భోజనముఁ బెట్టినట్టుల, ♦ బుద్ధిమీఁగాక
సాగరంబున వర్షించు ♦ చందమునను
ఖలునకుఁ బ్రియంబొనర్చినఁ ♦ గలదె ఫలము?.

సీ॥ అఖిలమృగములలో నేన ♦ యధముఁడనని
కుక్కురమ! యేటికూఱక ♦ కుందె దీవు?
ధరణి నధమాధముండు కృ ♦ తఘ్నుఁడుండ
నీకృతజ్ఞతకున్ గీర్తి ♦ నెగడకున్నె?.

—: వైదిక ద్విజులు :—

శా॥ ప్రాతఃక్షాళిత లోచనుల్, కరతల ♦ ప్రాంచత్పవిత్రాంకురుల్,
భూతివ్రాత నివేశితోరు తిలకుల్, ♦ భూమీసురుల్, వైదికుల్
జాతంబున్ మరణంబు నాబ్దికము నే ♦ చాయన్ బ్రవర్తిల్లునో
జ్ఞాతవ్యంబనుచున్ జరించుదురు నా ♦ నాశ్రాద్ధ బద్ధాత్ములై.

—: స్త్రీ స్వభావ నింద :—

సీ॥ సరససాహిత్య మనునది ♦ సహజముగను
స్త్రీలకు లభించు నందురు ♦ శిష్టజనులు
పురుషవరు బెట్టివారయ్యు ♦ బుద్ధిఁగలిగి
శాస్త్రముఁ బఠించినంగాని ♦ సంఘటిలదు.

శా॥ స్వాతంత్ర్యంబు, సదావిదేశగమనో ♦ త్సాహంబు, యాత్రోత్సవా
సీతాసక్తియుఁ, బుంశ్చలీసముదయ ♦ స్నేహంబు, వంధ్యాత్వమున్
యాతాయాతవినూత్నపూరుషదిదృ ♦ క్షాపాంగనృత్యంబు, ని
[illegible]వ్యాసిత మందహాసము, కుల ♦ స్త్రీ నాశనోత్పాతముల్

గీ॥ బాల భర్తృవియోగంబుఁ ♦ బడసెనేని
నెపుడు స్వగృహవ్యాపార ♦ హీనయేని

వార్థకా కంపితాంగుండు ♦ భర్తయేని
శీఘ్రకాలంబులోన న ♦ శింపకున్నె ?.

చం॥ సిరులకునేని, భోగములఁ ♦ జెందిసుఖించుట కేని, లేమికిన్
గొలకొలలాడి కష్టములఁ గుందుట కేనియునారకంబునన్
బొరలుట కేన్, బ్రిత్యహముఁ♦బోరి గతించుట కేనియున్, భువిన్
బురుషునకున్ గులాంగనయె♦మూలముగా వచియింతురి పండితుల్.

గీ॥ చూచినంజాలుఁ జిత్తంబుఁ ♦ జూలలాడుఁ
దాకినంజాలు విత్తంబు ♦ స్వీకరించు
సంగమించిన సత్వంబు ♦ సంగ్రహించు
నారి ప్రిత్యక్షరాక్షసి ♦ నరులకౌర !.

గీ॥ మీసములు లేకయుండిన ♦ మిసిమి నేలు
పాలుగానెంచు, మీసముల్ ♦ బలిసెనేని
లవణజలయుక్త క్షేత్రంబు ♦ లాగుఁదలఁచు
మీసములు తెల్లగానున్న ♦ సీసడించుఁ
గాంత యీరీతి భర్తను ♦ గారవించు.

—: కులవధూ వృత్తము :—

సీ॥ పడఁతి స్వగృహ బహి ♦ ర్భాగ పాదన్యాస
మహిఫణారోపణ ♦ మనుచునెంచి,
ఆత్మగేహముకంటె ♦ నన్యుల గేహమున్
ద్వీపాంతరంబని ♦ నిశ్చయించి,
తనపల్కు బంగార ♦ మని లోకులెన్నంగఁ
గృపణు విత్తంబున ♦ కెనయఁజేసి,
ఆత్మనాథునికంటె ♦ నన్యుని నెమ్మోము
చవుతిచందురునకు ♦ సమమొనర్చి,

గీ॥ చిత్తమున భర్తపదపద్మ ♦ సేవకంటెఁ
దీర్థయాత్రలు వ్రతములు ♦ వ్యర్థములని

తలఁచి, ధర్మపథంబున • మెలఁగునేని
నతని యశమొందు దొడ్డ యి • ల్లాలనంగ.

ఉ॥ ఎవ్వెడఁ దోడునీడయయి • యెవ్వఁడు విశ్వసనీయుఁ డాతఁడే
నెయ్యుఁడై, వందుసంసరణ • నిర్వృతిఁ గూర్చునతండె సత్సుతుం
డెయ్యది జీవనంబు ఘటి•యించునొ యయ్యదివిద్య, నెయ్యముం
దియ్యముఁదోపఁ బల్కెడు స•తీమణియే కులకాంతనాఁదగున్.

సీ॥ ప్రేమముంగల్గి, కడునాగ • రికతఁగలిగి,
చక్కఁదనమున రతిఁగాంచి • ధిక్కరించి,
వలచి వలపించి యనుకూల • వతిగనుండు
భార్య, యభిజాత, లభియింప • దార్యులార!.

—: అసతీ చరితము :—

చం॥ పతిసరసుండు, మన్మథుని•ప్రక్రియకున్ నిపుణుండు, చూడఁగన్
రతిపతిబోలువాఁడు, పర•రామలఁ గూడనివాఁడు, వాక్పటు
త్వమ్మతిఁగలవాఁడు, కల్మిఁ బరి•కింపఁ గుబేరునిసాటివాఁడు, సం
తతిఁగలవాఁడు, భార్య సత• తంబును గుందుట కేమిహేతువో?

—: భర్తకు భార్యకు సంవాదము :—

మ॥ "నెలతా! వంటకువేళయయ్యెనుగదే?" • "నీతల్లియేవండుఁబో;"
"నెలకున్ వండఁగలేవె లంజ?" "వినుమా•నీచెల్లెలే లంజయా;"
"ఇలువర్దించితొలంగు మావలకు" "నీ•యిల్లేమి?" "హాబ్రహ్మ! న
న్నేలమింజంపుము," "మన్మనోహరు మనో•భీష్టంబు సిద్ధించెమన్."

• అసతీ తత్త్వము •

చం॥ కలనయినన్ నిజంబుగ జ • గంబఖిలంబును బ్రహ్మమంచునేఁ
దలఁచెద; నన్యనింబతి వి • ధంబునఁ జూతు, సఖీ! విభేదమున్
గలిగి చరింప, జార నిజ • కాంతుల దేహము భిన్నమయ్యు వా
రలఁగలదొక్కయాత్మ యన• రాదె? జనుల్ నను దూఱనేటికిన్?

—: అసతీ విట సంవాదము :—

చం॥ "తెలివి! నపుంసకుండొ భవ•దీయ విభుండు?" రమింపఁజాలునే

ర్వరి” “రసహీనుఁడే?” “రసిక♦వర్యుఁడు” “రూపరిగాఢా?”
“మన్మథున్
గా నతఁడెచ్చెఁజూవె” “యనుఁ♦కూలుఁడుగాఁడనియా”?మదేకత
త్పరుఁడు”;“విచారమేల?”“విట♦వర్యుఁడవయ్య నెఱుంగఁజాలవే”

—: పుత్త్ర ప్రశంస :—

గీ॥ బలముచేఁగాని యెంతయుఁ ♦ బ్రజ్ఞఁగాని
ధనముచేఁగాని యెవ్వాఁడు ♦ తనకుటుంబ
భారము వహింపఁజాలునో ♦ వానివలన
జనని సత్పుత్త్రవంతు రా ♦ లనఁగఁదనరు.

గీ॥ మృతుఁడు, మూర్ఖుఁ, డజాతుఁడన్ ♦ సుతులుగలరు
మువ్వు రవ్వారిలోన సు ♦ పుత్త్రకుండు
రెండవ మహానుభావుఁడు ♦ పృథివియందు
జనని కాజన్మమున్ దుఃఖ ♦ మును ఘటించు.

గీ॥ ధార్మికుఁడు గాక మఱియు వి ♦ ద్వజ్జనుండుఁ
గాక యుండిన పుత్త్రుఁ డ ♦ క్కఱకురాఁడు;
గర్భిణియుఁగాక మఱియు దు ♦ గ్ధములనీక
యున్నగోవుతో నేమి ప్ర ♦ యోజనంబు?

—: మదన వర్ణనము :—

గీ॥ ఒండు రెండుగఁగావింప ♦ నోపు ధన్వి
లెందఱోగల రుర్విలో ♦ నిది నిజంబు,
రెండిటిని నేకముగఁజేయు ♦ క్రియను నొక్క
మన్మథుండను వాఁడె స ♦ మర్థుఁడగును.

వం॥ హృదయతృణాలయంబున ర♦హించుచునుండఁగ మన్మథాగ్ని, కో
విదుఁడుఁ జరించుఁజూవె యవి♦వేకమునన్ దఱిఁదప్పివచ్చెనే;
నిది యమృతంబుగా దల సు♦రేంద్రుఁ డహల్యనుగూడి,సద్యశో
భ్యుదయముఁ గోల్పడెన్ రతుల♦కొప్పులకుప్పలు లేరెయచ్చరల్?

—: విరహిజనోక్తి :—

చం॥ విదితముగాక యున్నె? సుమ ♦ వేణికఁ జూచి జటాటవీ వియ
న్నదియని యెంచితో? గళము ♦ నంగలకస్తురి కాలకూట మం
చుఁ దలఁచితో? శిరస్సునయి ♦ శోభిలు పుష్పము చంద్రరేఖయం
చెద భ్రమియించితో? మెయివ♦హించిన యాఘనసారభూతి బూ
డిదయనుకొంటివో? మదన! ♦ డీకొన మేకొనె దీవియోగినిన్.

ఉ॥ నాదు వియోగరోగము మ ♦ నంబున నెంచక మారవైద్యుఁ డా
హ్లాదదమీ వసంత కుసు ♦ మాకరమంచు, ఘనంబు పూర్ణ చం
ద్రోదయమంచు నిచ్చె; విన ♦ వో సఖి! నీ మధురాధరామృతా
స్వాదనమే యమోఘము భ ♦ వద్విరహజ్వర తాప మారఁగన్.

మ॥ "తనుసాంగత్యముకంటెఁ గేవల మనో ♦ దాంపత్య మత్యుత్తమం
బన నొప్పున్ హృదయేశ! నేనిచట నీ ♦ వచ్చోట వాసించినన్
మనచిత్తంబులు నిత్యమున్ గలయుచుం ♦ డంగాదె యాభర్తకున్
జనసంబంధిన మత్సుతుం గనిన నీ ♦ సారూప్య మొప్పారెడున్".

(అని యొక కాంత, దూరమందున్న తన ప్రియుని నుద్దేశించి పలుకుచున్నది.)

—♦ మేఘోక్తి ♦—

గీ॥ సంతతము నిన్నుఁ దలఁచుచు ♦ జలముకొఱకు
నాతురతఁ జూపెఁ జాతక ♦ పోతకంబు;
జలద! యొసఁగు మిప్పుడ, గాలి ♦ చెలఁగనేనిఁ
జాతకంబేడ? నీవేడ? ♦ సలిలమేడ?.

గీ॥ చాతకము భంగి వాయెత్తి ♦ సంతతంబు
జీవనముఁ గోరి నిన్ను యా ♦ చింప జలద!
నెమలియును దానఁ జూపె; నీ ♦ స్నేహమునకు
శబ్దమాత్రంబునకు నేను ♦ సంతసింతు.

—♦ సింహాన్యోక్తి ♦—

కం॥ పందులు లేళ్లున్ మందలు
మందలుగాఁ బఱచు, మాఁటి ♦ మాటికి వెఱచున్
గండక కుందక భీతిని
జెందక తోడ్పాటులేక ♦ సింహము మెలఁగున్.

సీ॥ సింహ మొక పుత్త్రినింగాంచి ♦ చింత లేక
నిద్రఁబోవుచు నున్నది ♦ భద్రముగను;
అమిత పుత్త్రులఁ గాంచియు ♦ నకట ఖరము
పాటువడుచున్న దతి భార ♦ వహనమునను.

గీ॥ పాపవశమున దుస్తర ♦ కూపమునను
సింహ మొక వేళఁ బడఁగాక ♦ చింతఁదక్కి,
తతనఖరధారలన్, దాన ♦ ధారలొలుకు
మదగజ కపోలములఁ జీల్ప ♦ వెదరునొక్కొ ?.

—♦ గజాన్యోక్తి ♦—

ఉ॥ దానముఁగోరి తుమ్మెదలు ♦ తారసిలంగ, మదాంధ బుద్ధిచే
నేనుఁగు కర్ణతాళముల ♦ నెంతయు దవ్వుగఁ దోలుఁబో. యస
న్మానముగా, స్వగండయుగ ♦ మండనహాని ఘటిల్లుఁ; దమ్మి పూఁ
దేనెలఁ గ్రోలి తుమ్మెదలు ♦ దిమ్మరలేవె సరోవరంబులన్ ?.

ఉ॥ శైలసమీప నిర్ఝరుల ♦ స్నానముఁజేయుచు నీదులాడుచున్
గేళినిఁ దేలు మబ్జములఁ ♦ గేలనుద్రుంచి భుజించి నిక్కుచున్
నీలుగు మంతెకాని కరి ♦ ణీ కరలాలిత గండమత్తశుం
డాలమ! మానుమీ మనము ♦ నన్ మృగరాజ రణాభిలాషమున్.

ఉ॥ కంధర తీవ్రపాశమునఁ ♦ గట్టువడెన్, జరణంబు శృంఖలా
బంధమునన్ గ్రహించె, సృణి ♦ పాతమునోర్చె శిరంబు, నీ దృఢ
స్కంధము వస్తుభారమున ♦ సన్నగిలెన్, వర దాన తృప్త పు
ష్పంధయ గంధ సింధురమ! ♦ పల్కుపుగా మద మెట్లుహెచ్చెనో?.

గీ॥ తాపవశమున, నతినిమ్న ♦ కూపమునను
తుండమును జాచి, లభియింప ♦ కుండె సలిల
మనుచు లఘుభావమునఁ గుందఁ ♦ జనదు గజమ!
తతసరోవరంబున నీదు ♦ తనివి దీఱు.

చం॥ మదగజమా! వచింతు విను ♦ మా! మదియించితివేని, నేరికిన్
జెదరని దానవేన్, సరళ ♦ వృక్షములన్ విదళింపనేటి క
ల్లదె పరికింపుమా గిరి గు ♦ హన్ నివసించుచు నుండు సింగపుం
గొదమను దాకిసన్, వెడఁద ♦ గోళ్లను బాపుఁ గపోల ఖర్జువున్.

— ♦ మృగాన్యోక్తులు ♦ —

గీ॥ వైభవోన్మత్త చిత్తుల ♦ వదనములను
గోరి వీక్షింపకుండఁ గాం ♦ తార సీమ
నల్ప దూర్వాంకురంబుల ♦ కలరె దహాహా!
ఏణ రాజమా! ధన్యుఁడ ♦ వీవ భువిని.

గీ॥ తృణఘటితపూరుషుండు ధ ♦ రించినట్టి
తృణ శర శరాసనంబుల ♦ రీతిఁ జూచి
సాధ్వసంబునఁ గలమ మం ♦ జరులఁ బాసి
మృగకిశోరమ! యుఱుక ప ♦ ర్వెత్త నేల ?.

చం॥ నరులకుఁ జాలదవ్వని వ ♦ నంబులఁ బాయక సంతతంబు, ని
ర్ఝరిణుల నీరుఁ ద్రావుచు, గు ♦ జంబుల నీడల విశ్రమించుచున్
గరికమెసంగి, యేరి కప ♦ కార మొనర్పక సంచరించు నీ
హరిణములన్ వధింతు రహ ♦ హా! జనులన్ దనియింప శక్యమే?.

చం॥ ఇరుదెసలందుఁ జూడ వల ♦ యేర్పడె, వెన్కదవాగ్ని రేగెఁ, గు
ర్కురములు సన్నిధిం జెలఁగెఁ, ♦ గ్రూరుఁడు వ్యాధుఁడు చాపమూని ముం
దఱ గుఱిఁ జూచుచుండెను, ప ♦ దంబుల బాలకు లాశ్రయించి రా
హరిణి, స్వగర్భభార జని ♦ తాలసయై పతిఁ జూచె నక్కటా!.

ఉ॥ నారి పుటుక్కునం దెగె, ఘ ♦ నంబగు చాపము ముక్కలయ్యె, నా
క్రూరుఁడు వ్యాఘ్రుఁడుం బఱచెఁ ♦ గుక్కలతోడ, దవానలంబు చ

ల్లారఁగ వానయున్ గురిసె; ♦ నా కరుణాభరణంబు రాఘవుం
డారసి ప్రోచెనేనిఁ దర ♦ మా? యొకఁడొక్కని సంహరింపఁగన్.

—♦ రాసభాన్యోక్తి ♦—

మ॥ ప్రతిభాశాలురు చూచె యాశ్రితులు భూ ♦ పాలుండు; వాలా
స్వైత
ప్రతిజీవిన్ హరియందు; రాజతురగా ♦ వాసంబునందుండ క్కి
గతి నొందించెదవో సి రాసభమ! కు ♦ గ్రాసంబు భక్షింపఁ జా
లిత కొల్వేటికి ? వస్త్రభారవహన ♦ క్లేశంబు నీ కేటికిన్ ?.

—♦ హంసాన్యోక్తులు ♦—

గీ॥ గళము సారించి దిక్కులఁ ♦ గలయఁ జూచి
గట్టిగాఁ గూయుచున్నది ♦ టిట్టిభంబు
మానముం గలదాన వేన్ ♦ మౌన మొండె
అవసరణమొండె, శరణంబు ♦ హంస! వినుము.

మ॥ కలహంసంబు దినాంత వేళ, బకముల్ ♦ కారండముల్, కాకముల్
గల కాసారము, నధ్వగశ్రమ మణం ♦ గన్ జేరఁ, గాకాది ప
క్షులు వీక్షించి, హసించి, మూఁగదియ యుం ♦ చున్ దుర్బ్యం
బకంబులన్
ఖలులన్ జేరిన నెట్టివారి కయినన్ ♦ గష్టంబు రాకుండునే ?

—♦ భ్రమరాన్యోక్తులు ♦—

మ॥ అకటా! పద్మవనాంతరస్థ మధుపం ♦ బంభోరుహాస్యంద స
న్మకరందాసవ మాస్వదించి, యధికో ♦ న్మాదంబునన్ క్షుల్ల చం
పక గంధంబును ధిక్కరించి, విధిచే ♦ వైదేశమొందద్రిమ
ల్లిక శ్రేష్ఠంబనుచున్ దదాసవముఁ గ్రో ♦ లెన్ లోనశ్లాఘించుచున్.

చం॥ వలపులకున్ ధ్రువంబుగ న ♦ వంబు ప్రియంబుగ నూనునంచు లోఁ
దలఁచి, కదంబ కాననము ♦ నన్ విహరించి, యశోక వాటికన్
మలసి, రసాల పుష్పనవ ♦ మల్లికలందు రమించి, నేటి కీ
వెలమిని తమ్మిఁగూడెదవొ? ♦ యెంతటిదానవె గంధుఁ ముమ్మెదా?

—♦ కోకిలాన్యోక్తులు ♦—

గీ॥ కాకపిహితమిా చూతంబు ♦ కోకిలంబ !
మానముం బూనఁదగదు నా ♦ మాటవినుము;
పంచమ రవంబునం గూయు ♦ మించుకంత;
ని న్నెవండు గ్రహించునే ? ♦ మిన్నకున్న.

గీ॥ పోలఁతులను విస్వసింపని ♦ పురుషవరుఁడు
ధూర్తుఁ డయ్యును వారి కం ♦ ఘుండ యగును;
కాకి శిక్షింపఁగా నేర్పు ♦ గలదియయ్యుఁ
బరభృతస్త్రీల వంచింపఁ ♦ బడక యున్నె ?.

♦— చాతకాన్యోక్తులు ♦—

ఉ॥ చాతకపోతకంబ! హిత ♦ సంగతిఁ బల్కెద నాలకింపవా?
ద్యోతలమందు నంబుదము ♦ లోలి, గమించు ననేక భంగులన్;
త్స్నాతలమెల్ల సాగరము ♦ గాన్ జలధారలనీనుఁగొన్ని, ని
ర్ఘాతములన్ ద్యజించుగతి ♦ గర్జిలుచున్ వడిఁబోవుఁ గొన్ని, నీ
వేతరినేన్ ఘనాఘనము ♦ నే తిలకింపు మభీష్టసిద్ధికిన్.

గీ॥ చాలకాలంబు బ్రిదుకుమో ♦ చాతకంబ!
మహిఁగల విహంగములనీవ ♦ మానివాదు;
ప్రాణములనైనఁ బాసెద ♦ వంతెగాని
ఘనునిఁ దక్క యాచింపవే ♦ జనునినైన.

—♦ శుకాన్యోక్తి ♦—

గీ॥ సకలఖగములు స్వేచ్ఛగ ♦ సంచరింపఁ
బంజరంబున బంధింపఁ ♦ బడితివీవు
కారణంబేమొ యూహింపఁ ♦ గలవె చిలుక ?
తెలియకున్నె ? నీమధురవా ♦ క్కుల ఫలంబు॥

♦— కాకాన్యోక్తి ♦—

గీ॥ ప్రాతరారంభవేళనా ♦ భాస్కరుండు
తమ్ముఁ దామినప్రిపటలిగఁ ♦ దలఁచుననుచుఁ

గోకులము, కాకులమయంచు ♦ వ్యాకులమునఁ
గాకములు కూయుచున్నవి ♦ కరుణదోఁప.

శా॥ కేకిన్, లోకులు, గాయకుల్ మిగుల శ్లా ♦ ఘింపంగ వీక్షించి,ది
గ్వ్యాకీర్ణంబగు తద్గళస్వనము న ♦ భ్యాసంబుగావింపఁగన్,
గాకారావముఁ జేసెదీవకట! కా ♦ కారావమేనాటికేన్
గేకారావమనంగ నొప్పగునె? కా ♦ కీ! కేకి వెల్గాదువే?.

—♦ సముద్రాన్యోక్తులు ♦—

గీ॥ భూరిరత్నంబులకు జన్మ ♦ భూమియయ్యు
నంబుధికి మదంబిసుమంత ♦ యైనలేదు,
కొన్ని ముత్యంబులంగల్గి ♦ యున్నకతన
మదముచేఁ గన్నుగానదు ♦ మదజగంబు.

గీ॥ తగవుమాలి రత్నంబు న ♦ ధఃకరించి
తృణము ఘనమంచుఁ దలను ధ ♦ రించెదీవు;
తృణము రత్నంబునకుఁ దుల ♦ యేతలంప?
నోయిసాగరా! జడుఁడవే ♦ హో యెఱుంగ.

గీ॥ మారుతోల్లాసితోల్లోల ♦ మండితాబ్ధి!
జలధరుని పోల్కి గర్జించి ♦ చెలఁగెదీవు
దప్పిచేఁ బాంథుఁ డొకఁడునీ ♦ తటమునందు
నడుగుచున్నాఁడు నడబావి ♦ యడరుచోటు.

శా॥ ఓయీ! సాగర! రాళ్లతోఁగలసి మే ♦ న్నోరత్నముల్ పొర్లెడున్,
నీయందే నిదిరించుఁగా జలచరా ♦ నీకంబుత్రోశౌరి, నే
నీ, యజ్ఞానముఁ జూచి ఛీయని కడున్ ♦ నిందింపనా లేక నే
నీ, యౌన్నత్యముఁజూచి నిన్ బొగడనా ♦ నిక్కంబుగన్ జెప్పుమా.

♦ అగస్త్యాన్యోక్తి ♦

సీ॥ ఆనాకవిభుభీతి ♦ మైనాకమాదిగాఁ
గలశైలముల్ గడ ♦ గడవడంకెఁ

గంధరబృందంబు ♦ గర్జనచ్ఛలమున
నాక్రందనముఁ జేసె ♦ నఖిలదిశలఁ
దనతండ్రికి ఘటిల్లు ♦ దశను విలోకించి
జడభావముం బొందెఁ ♦ జంద్రిమసుఁడు
సురసార్వభౌముని ♦ భరియింపకుండఁ బ్రి
ధావించుచున్నదై ♦ రావతంబు

గీ॥ వార్ధికన్యాపరిష్వంగ ♦ వైభవమున
నిద్రితుండైన శౌరియు ♦ న్నిద్రఁ డయ్యెఁ
గుంభసంభవ! కీడ్పాటు ♦ సంభవించు
వార్ధిపినువుము శుభములఁ ♦ బడసెదీవు.

—♦ నద్యన్యోక్తి ♦—

గీ॥ ఇతరదివసస్థాయు, నీ ♦ యతులజీవ
నప్రవాహంబు చిరముంచు ♦ నమ్మితో? భూ
వర్తిదుర్గ్రీమపాతన ♦ పాతకంబు
శాశ్వతంబు స్రోతస్విసీ! ♦ విశ్వమునను.

—♦ తటాకాన్యోక్తి ♦—

గీ॥ ఓ! తటాకంబ! యిపుడ నీ ♦ యుదకములను
యాచకులకిమ్ము, నీయీవి ♦ సార్థకముగఁ
బృథివిపై ఘనాఘనము వ ♦ ర్షించెనేని
నెవఁడు యాచించు నీమనం ♦ బుపులఁ జెపుమ,

చం॥ వినవా? తటాకమా! యినుని ♦ వేఁడిమిఁ గోడిన దానవేని, జీ
వనము నశించునేని, నన ♦ పాయముగన్ జలపక్షులాకసం
బున కెగయున్, శిలీముఖ సమూహము మావులఁ జేరు, నిన్నుఁ బా
సిన నుసుఁ బల్ త్యజింతుమను ♦ చేపలకున్ గతియేమి చెప్పుమా.

ఉ॥ పారను ఘోషమాన జల ♦ సంపదకున్ గను నుల్లసిల్లుకా
వారమ! యిత్తతిన్ బథిక ♦ పంచయుదాహముఁ దీర్పఁ జాలవైన్ా?

దారుణ తాపకారణ ని ♦ దాఘము నిప్పుల ఉప్పు వేన్, భవ
న్నీరము లింకవో? చెపుమ ♦ నీవపు డెట్టులు దప్పిఁ దీర్తువో?.

ఉ॥ వారిజ కైరవ ప్రికర ♦ వాసిత నిర్మల నీరమందు సం
చారముఁ జేయు హంస, బక ♦ సంచయముంగని సంతసించి కా
సారమ! నిన్నుఁ జేరితి, మొ ♦ సళ్లను లోఁగల దానవంచు లో
నారయకుంటి; సక్కటక ♦ టా!! కపటాత్ములఁ జేరవచ్చునే?.

—: కమలాన్యోక్తులు :—

గీ॥ కెరలి కూశ్మాండ కోశాత ♦ కీసుమాళి
పద్మ కైరవంబులఁ బోలి ♦ పవలు, రాత్రి,
వికసితములైన యంతనే ♦ భృంగకులము
చేరి తత్కర్ణి గానంబుఁ ♦ జేయు నొక్కొ?॥

గీ॥ చంద్రుఁ డుదయించి నంతనే ♦ సర్వజనుల
కమిత సంతోష ముదయించు ♦ నంబురుహామ!
ఈవు సంకోచముం బొంద ♦ హేతు వేమొ?
చండకరుఁడు గాడనియా ని ♦ దంబుఁ జెపుమ.

—: కూపాన్యోక్తి :—

గీ॥ సరస హృదయంబు గలదాన ♦ వరసి చూడ
గుణగణగ్రాహి వీరితిఁ ♦ గూలఁ బను దె?
అమిత నైచ్యంబుఁ బొందితి ♦ ననుచు నహహా!
కూపరాజమ! యింత సం ♦ తాపమేల?.

—: రత్నాన్యోక్తులు :—

గీ॥ నృపతి కోటీరముం బాసి ♦ పృథివి జారి
భూరజంబున బ్రింగి సొం ♦ పుం దొలంగి
రతన మొక్కండు దుర్విధి ♦ కతన నకట!
జనులపాద విడంబనం ♦ బును సహించె.

మ॥ కరయుగ్మంబునఁబట్టి నిన్నదిమి, యా♦ఘ్రాణించి, చుంబించి,దు
ష్కరమ్మాటన్ దిగమ్రింగ, వాతెఱచి నీ♦ తత్కారంబుఁగావించువా

పరమునుఁగాంచి, హసించెదేల? భవ దంతస్సార మేపాటియో
పరికింపన్ విభజింపకుండ విడిచెన్ భావింపుమా రత్నమా!

—: శంఖాశ్యోక్తి :—

ఉ॥ ఎక్కడ! లక్ష్మికిన్ జనకుఁ డైనను గాంచిన యట్టి సాగరం
బెక్కడ? మల్లెఁబోలు తను వెక్కడ? విష్ణుకరంబు నాస్థలం
బెక్కడ? నీచవక్త్రముల నివ్విధిఁ జిక్కితి దిక్కులేక నే
నెక్కడ?యంచు శంఖ మతిహీనముగన్ విలపించె మ్రోగుచున్.

—: సామాన్య వృక్షాన్యోక్తులు :—

గీ॥ మండువేసవి చనుదేర మార్గమునను
ఒండు వృక్షంబు మాత్రమ యున్నదకట!
అధిక పథికులు తన నీడ నాశ్రయించి
రనుచు నాగ్రహము పరితాప మవనయించె.

సీ॥ ద్విజకోటి సేవింపఁ దేజరిల్లితి వంచుఁ
బాంథుల కాధార వసతి వనుచు
వృక్షంబులను నిన్ను వినుతింతు రంచు, స్ని
గ్ధచ్ఛాయలంగల దాన వనుచుఁ
జూచి యానందింప సొంపుఁగాంచితి వంచుఁ
బరగుణంబుల కునికి పట్టువనుచు
మోదమూరగ వీచి సేదఁదేర్చెద వంచు
ఫలములచే క్షుత్తుఁ బాపు దనుచు

గీ॥ నో మహావృక్షరాజమ! యుచ్చదీయ
పాదముల నాశ్రయింపఁగ వచ్చి, భయద
కోటర ద్విజిహ్వానేక ఘాటి కకట!
పఱచితిమి చాల దవ్వుగ వెఱచి మేము.

గీ॥ అశని, యనలంబు, హిమము, ఝం ఝూనిలంబు
నెత కాలంబు దనుక ని న్నెనయ కుండు

సంతసపడక నీ యుపకార • మవని రుహామ!
ఆపయిం జూడ మాకు నీ • యాస గలదె?•

—: కల్పవృక్షా న్యోక్తులు :—

గీ॥ కాలనియతినిఁ గల్ప వృ • క్షంబు, నన్య
వృక్షములఁ బోలి ఫలముల • నిచ్చునేని
వనమునం గల భూరుహం • బునకుఁ దనకు
నెవ్విధిన్ భేదముండు? నూ • హింప వలదె?•

చం॥ జననము క్షీరసాగరము, • చక్కనియీవికిఁ గమ్మతావికిన్
ఖనివని వేల్పులందురు జ • గద్విదితంబుగ; వాసభూమి, నం
దనవన, మోసికల్పకమ! • తథ్యముఁబల్కెద లోపమున్నె నీ
ఘనతకు? నర్థియోగ్యతనుఁ•గాంచు వివేకము మాత్రముండు నేన్•

—• చందనాన్యోక్తులు •—

మ॥ పులులన్ గాంచిన కానఁబుట్టి, వికట•స్ఫూర్జ త్ఫణా భీషణం
బుల సర్పంబులఁ బెట్టుకొంటి వతు లా•మోదంబుఁ గాపాడఁగన్;
ఫలపుష్పంబు లదృష్టహేతువున సం•ప్రాప్తించుఁ బో, యవ్వ డ
న్యులు రాకుండగ నెట్టి కాపుగడ, లో•నూహింతువో? చందనా!•

చం॥ ఫలములు పుష్పముల్ గలిగి•వర్ధిల కుండ సృజించెఁగాదె నిన్
జలజభవుండు? వానిమతి•జాడ్యము లోకు లెఱుంగరో క్కొ! య
న్యులు భవదీయ సౌరభము•లొంది సుఖింపరె? దాననీకు న
త్ఫలము లభింపకున్నె? యిల•ధన్యతఁ గాంచదె నీదు జన్మమున్?•

—• అశోకాన్యోక్తి •—

గీ॥ ఇరుపురముఁ జూడ రాగుల • మురుశిలీము
ఖాప్త వైభవం బిరుపురి • యందుఁ గలదు
అతివ పదహతి యిరుపుర • నలరఁజేయు;
నాకు నీకంటె శోక మ • శోక! హెచ్చు.

(ఇ ట్లొక వియోగి)

—♦ మాలత్యన్యోక్తి ♦—

సీ॥ మాలతీ! షట్పదంబు తుం ♦ బీ లతాంత
చుంబనంబునఁ గడుఁ జొక్కి ♦ సోలెననుచు
వగచెదో? చతు ష్పాదంబు ♦ పశువె యైన
నేమికావలె షట్పదం ♦ బెఱుఁగ వాక్కొ?

—♦ సహకారాన్యోక్తి ♦—

ఉ॥ సార రసాలవృక్షమ! ని♦జంబుగ నీ ఫలపుష్పజాత స
త్సౌరభ మారయన్ మలయ♦జంబును మించును, కప్పురంబుఁ గ
స్తూరిని మీఱు, నైన నొక♦దోసము వాటిలె నీకు, గౌర వా
గౌరవదృష్టి లేదు పిక♦కాక కదంబ సమాగమంబునన్.

—♦ న్యగ్రోధాన్యోక్తి ♦— (న్యగ్రోధము=మఱ్ఱిచెట్టు)

మ॥ అకటా! సద్ద్విజసేవలం బడసి, య ♦ త్యౌన్నత్యముం బొందితే
లిక వై మ్రాకుల కైనఁ బొంతఁగల ప ♦ ల్లీజాత కూశ్మాండ వ
ల్లిక నీపండ్లకు నవ్వుచున్నయది, యీ ♦ లీలం బ్రశంసించు నై
తకు లోపంబని లోఁ దలంపకుము, క్రో ♦ ధంబేల? న్యగ్రోధమా.

—♦ శాల్మల్యన్యోక్తి ♦— (శాల్మలి=బూరుగు)

సీ॥ పరికింప సొంపారు ♦ పద్మవనంబును
నాశచే నేతెంచు ♦ హంసములను,
కమ్మతావుల నీనఁ ♦ గల పూవులను భ్రాంతి
జుమ్మజుమ్మని వచ్చు ♦ తుమ్మెదలను
మధురఫలస్యంద ♦ మధుపూరముం గ్రోలఁ
బరువుపర్వనవచ్చు ♦ పాంథజనుల,
మాంసరాశిగ నెంచి ♦ మానసంబునఁ బొంగి,
మెలమిఁ జేరెడు కాక ♦ గృధ్రములను,
గీ॥ ధరణి, నిస్సార మిథ్యోన్న ♦ తమునఁ గ్రాలు
శాల్మలి కుజంబ! సుమరాగ ♦ సంచయమునఁ

బ్రతిదినంబును వంచింపఁ • బాడియగునె ?
ఇట్టులెన్నాళ్ళు వంచింప • నెంచితొక్కొ ?

—• నింబాన్యోక్తి •— (నింబ=వేఁప)

గీ॥ పరశువుం బూని నఱకిన • వానికైనఁ
దేనియ, ఘృతంబుఁ బూసిన • వానికైన
గంధమాల్యాదుల భజించు • ఘనునకైనఁ
గటువుగనె యుండు నింబ వృ • క్షంబు లకట !

—• బబ్బూలాన్యోక్తి •— (బబ్బూలము=తుమ్మ)

సీ॥ ఏవ్వరైన నీయండఁ • జేరకుండఁగ ఘోర
కంటకంబులఁ బెట్టు • కొంటి వీవు
పథిక శ్రమంబును • బాపఁజాలుదువన్న
నిలువ నీడయు లేక • పొలిచె దీవు
వరపుష్పములనైనఁ • బడయవచ్చునొ యన్నఁ
దావిలేని సుమాళిఁ • దాల్చితీవు
కడుపునిండఁగఁ బండ్లఁ • గైకొనం దగునన్నఁ
గడువ్యర్థ ఫలములఁ • గంటివీవు

గీ॥ అహహా ! బబ్బూల ! నీజన్మ • మట్టులుండె
నితర వృక్షంబులట్లు ఫలంబు • లేరికైనఁ
జిక్కకుండఁగఁ గాపాడఁ • జెలఁగెదీవు
నిను సృజించిన బ్రహ్మనే • మనఁగవచ్చు ?

—• ఇక్ష్వన్యోక్తి •— (చెఱకు)

చం॥ కఱకఱ ద్రుంచి దంచిన, వి•కారముఁ బొందెన, వంకఁ బోయిచన్
విఱిగిన, గానుగం జొనిపి•పిండిన, వండిన, నైన మాధురీ
గరిమఁ ద్యజింపకుండ నుప • కార మొనర్పఁగఁ బుట్టినట్టి యా
చెఱకు మనుష్యలంబున న • శించిన నయ్యది దేనిదోసమో ?

—♦ కంటకారికాన్యోక్తి ♦— (కంటకారిక=వాకుడుచెట్టు)

సీ॥ విమల ఫల పుష్ప భూషిత ♦ వృక్షములకుఁ
గంటకంబులు దగియుండుఁ ♦ గాపుగడకుఁ
దలఁప రసగంధములు లేని ♦ దానవీవు
కంటకారిక ! నీకేల ♦ కంటకములు.

—♦ ధుత్తూరాన్యోక్తి ♦— (ఉమ్మెత్త)

శా॥ రాజస్థానము శూలినీకొసఁగె బో, ♦ రంజించెదో వారిధిన్?
రాజీవంబుల నేచెదో?కుముదముల్ ♦ రాజోపలానీకముల్
రాజిల్లంగలవ్రా? తమంబణఁచెదో? ♦ రామాస్య సామ్యంబుచే
నోజస్సున్ బ్రకటింతువే మొ? చెపుమా♦యున్మత్త పుష్పాధమా!

—♦ ఈశ్వరాన్యోక్తి ♦—

సీ॥ వర గజాశ్వములకు ♦ వైభవం బణఁగునో ?
వృషవాహనంబున ♦ వెడలెదీవు
బంగారమున కెట్టి ♦ భంగంబు గలుగునో ?
చిలువులన్ దొడవులఁ ♦ జేసితీవు
లోకబాంధవునకు ♦ లోటు వాటిల్లునో ?
తలను దోషాకరుం ♦ దాల్చితీవు
వలిపంపు వలువల ♦ విలువ క్షీణించునో ?
దిసమొలవాఁడవై ♦ తిరిగెదీవు
గీ॥ ప్రమదవనముల కెట్టి లో ♦ పంబువచ్చుఁ ?
బ్రేత వనసీమలన్ సంచ ♦ రించెదీవు
భవదవ గుణంబుల గణింప ♦ వచ్చునొక్కొ ?
ఏమనందగు? నీవు వి ♦ శ్వేశ్వరుఁడవు.
సీ॥ పంచాననుఁడనంచు ♦ భావించి గర్వించి
బ్రహ్మశీర్షముఁదుంచు ♦ పాపివైన,
మత్తచిత్తుండవై ♦ మాతల వలపించి
సంగమించినయట్టి ♦ జడుఁడవైనఁ,

బ్రీతిమై సతతంబు ♦ భూతసంతతిఁగూడి
కాటిలో నివసించు ♦ మేటివైన
ప్రజలను సృజియించి ♦ భరియింపఁజాలక
వడిసంహరించిన ♦ వాఁడవైన
గీ॥ నవగుణంబు లెన్నని నీ ♦ యందునున్న?
నెవని నతిభక్తి సేవింతు? ♦ నెవఁడుదిక్కు?
ఏమిచేయుదు? నాదుఃఖ ♦ మెవఁడు వినును?
లోకముల కేలిక వునీవు ♦ లోకనాథ !.

## సంకీర్ణాన్యోక్తులు

గీ॥ అఖిలభువనంబుల భరించు ♦ నంబుజాక్షు
లీలఁగ వహించు గరుడుండు ♦ క్లేశమొంది
విశ్రమముఁ గోరనేని నే ♦ వ్యక్తుమైన
నోపఁజాలునె భరియింప ♦ నుర్వి నుంగు.
గీ॥ ఓయి ఫణిరాజ! యాలింపు ♦ మొక్కమాట
వసుధ భరియింపఁ జాలిన ♦ వాఁడవీవ
వక్త్రమును వక్రముగఁద్రిప్ప ♦ వలను పడదు
ఈవు దుఃఖింప సుఖియింతు ♦ రెల్లజనులు.
చం॥ సలిలమ! సర్వదేహులకు ♦ శైత్యము నీవలనన్ లభించు, ని
ర్మలముగనుండు వక్కతన ♦ మైలనశించు స్పృశించినంత, జీ
వులకిల జీవనంబవనఁ ♦ బోలుఁనిజంబుగ; నైన; నున్నతిన్
నిలువక పాఱుచుందువతి ♦ నీచపథంబున కేమిచెప్పదున్.
సీ॥ క్ష్మామేఖలంబోలు ♦ గంభీర కలశాబ్ధి
కడుపార నేకన్నెఁ ♦ గన్నతండ్రి,
ఫాలనేత్రుని శిరో ♦ భాగస్థ వ్రజంబు
తుహినాంశువే దాన ♦ తోడఁబుట్టు,

పదునాల్గు జగములఁ ♦ బాలించు విన్నాణి
వైకుంఠుఁ డేసతీ ♦ ప్రాణవిభుఁడు;
కోటికోటుల యాట ♦ పాటల నేపారు
వనజ మే వనజాక్షి ♦ కునికిపట్టు,

సీ॥ లలిత కలవాణి, వాణి, య ♦ న్నలువరాణి
ఏలతాంగికిఁ గోడలై ♦ యొసఁగుచుండు,
నమ్మహాలక్ష్మి, ప్రకృతిచే ♦ నబల యగుటఁ
జపలయై దుష్టులం జేరు ♦ సంతతంబు.

కం॥ కుంభస్తనస్త్రీమద జృంభిత
రంభాసంభోగ సుఖము ♦ గ్రహియింపఁ దగున్
జంభారికి; ఘటచేటీ
సంభోగ విటుం డెఱుంగఁ ♦ జాలునె పుడమిన్.

చం॥ మణులు శిఖాకలాపముల ♦ మాణిక్య వెలుంగ, శరీరమున్ బ్రతి
క్షణముఁ ద్యజింతు, జీవనము ♦ గాడుపు, వాసము భూబిలంబు, వీ
క్షణమశుభంబు, వక్త్రము వి ♦ షంబు ద్విజిహ్వలఁ గ్రక్కుచుండు, నో
ఫణీశ్వర! నీదుచర్య యతి ♦ వక్రముగన్ గనుపట్టు నక్కటా!

గీ॥ ఆరయన్ విషభార న ♦ హస్రమునను
అహివిభుండు గర్వింపఁ డా ♦ వంత యైన;
బిందు మాత్ర విషంబున ♦ వృశ్చికంబు
కంటకం బూర్ధ్వ గతిఁబూను ♦ గర్వమునను.

గీ॥ దివ్యమగుచూతరసమును ♦ తృప్తిదీఱఁ
ద్రాగు పరభృతంబునకు గ ♦ ర్వంబులేదు;
కప్ప, కర్దమజలపాన ♦ కారణమున
రటరటధ్వనిఁ, జేయు ది ♦ క్తటములదర

ఉ॥ మేనసువర్ణమున్ మొలకు ♦ మేఖలయున్ జెలువార ముక్కునన్
మాసికమున్ ఘటించి మణి ♦ మాలలఁ గంఠమునందమర్చి న

న్మానముఁజేసి కాకిఁ బలు ♦ మారులఁజూచిన రాజహంసమా
నే? నవచూతపల్లవము ♦ లిచ్చినఁగోకిలమై రమించునే?

ఉ॥ డాలెసఁగంగఁ గృతఘ్నమన ♦ టాపటలంబునమర్చి, సింగవుం
బోలికఁగూర్చి, సింహాపద ♦ మున్ శునకంబునకిచ్చినంత, గ
గ్గోలొనరించి మత్తగజ ♦ కుంభవిపాటనపాటవంబునన్
గాంలునో? యెంగిలాకులను ♦ గాంచిపయింబడి నాకకుండునో?,

ఉ॥ తేలుచునీఁదుచున్ హ్రదము ♦ తీరమునంగలనీటఁదుళ్లుచున్
జాలరి హస్తమందుఁగల ♦ జాలమునంబడియుండి, యెట్లులో
నేలకుజాఱు మీనమును ♦ నెవ్వడి నొక్కబకంబు మ్రింగెః నే
లీలలనైన యత్నము ఫ ♦ లించునె? దైవము కంటగించినన్

గీ॥ అపకృతికిఁబూనుకొనువాని ♦ కుపకరించు
ఘననిజన్మంబు సార్థకం ♦ బనుచునెంచి
జాల ఋష్విన యామూఢ ♦ బాలకులకు
మధురఫలముల నొసఁగితో ♦ తమ్మెరుహాంబ!

ఆ॥ వె ఉల్లిచేయుమేలు ♦ తల్లిచేయదనంగఁ
దనరు నుల్లితనదు ♦ తావి వలన
నింద్యమైనయట్లు ♦ నిఖిలపదార్థంబు
లొక్కదోషమునకుఁ ♦ దక్కవగను.

చం॥ మృతునివధ్రయోజనంబు ఘటి♦యిల్లునె? లోభికిఁద్యాగముండునే?
పతినెడఁబాసి జారవల ♦ వంతకుఁ జిక్కనె? యెన్నఁడైన దు
ర్మతి కపటంబుఁబాసి వర ♦ మైత్రికిఁ జొక్కనె? సర్పమోప్పవన్
క్షితిని మెలంగునే? యజుని ♦ సృష్టిఁగనుంగొనుఁడింతయేటికిన్.

గీ॥ వసుధఁగలయెట్టి యుత్తమ ♦ వనితనైన
విశ్వసించిన పురుషుండు ♦ వెంగలీఁడు!
రాజు వలచినయత్తికై ♦ రవిణియొకట!
మధుపబృందసంభోగము ♦ బాయకుండె.

గీ॥ అజ్ఞతనో, లేక యధిక రా ♦ గాతిశయము
వలననో? రాజు గాజునౌ ♦ దల ధరించి
నంత నయ్యాదిమాణిక్య ♦ మనఁగఁదగునె?
విదితమగు రత్న శాస్త్ర వి ♦ వేకమునను.

గీ॥ పంకమనుశంక, నీపొంక ♦ మింకునట్లు
పామరులు త్రోసిపుచ్చిన ♦ వగవఁదగునె?
నీదునుపయోగము గ్రహించు ♦ నృపులు లేరె?
ఓసి మృగమదమా! దుఃఖ ♦ మోర్చుకొనుము.

—❀ మిశ్రప్రకరణము ❀—

గీ॥ పరుని ముఖమున వెడలిన ♦ పరుషవాక్య
మాప్తుఁడు వచించెనేన్ బరి ♦ హాస మగును;
అన్యకాష్ఠంబునం బుట్టి ♦ నట్టి ధూమ
మగరున జనించెనేన్ ధూప ♦ మనఁగఁ బరఁగు.

గీ॥ సిరుల నిమ్మని నిన్ను యా ♦ చింపలేదు
గృహమునుండి యావంతయు ♦ నీయవలదు
పలుకు తోడ్పాటు వలన లే ♦ వడియుఁ గలదె?
ఓయి యుద్యోగి! యుపకృతి ♦ కోపలేవా?.

గీ॥ స్వస్థలంబును బాయని ♦ వఱకు నీకు
వరుణ భాస్కరు లిరువురుం ♦ బ్రాణసఖులు;
స్వస్థలముఁ బాసినంతనే ♦ జలరుహాంబ!
వార లిరువురు నీకెట్లు ♦ వైరులైరి?.

గీ॥ వనమును దహించు వేళను ♦ వహ్నికతుల
గతులఁ దోడైనయట్టి యా ♦ గాలిదయ్య
మింటి దివ్వె నేటికి నశి ♦ యింపఁజేసె?
సౌహృదము దుర్బలుని యందు ♦ సంఘటిలునె?

ఉ॥ పోలుపరాని సంపదలఁ ♦ బొంది భుజించెడు శక్తి, యుత్తమ
స్త్రీలనుఁ గూడి వారల ర ♦ తిన్ దనియింపఁగఁ జేయుశక్తి, యే
వేళ ధనంబుఁదెచ్చి నిరు ♦ పేద కొసంగెడు దానశక్తి, యు
ద్వేల తపఃఫలంబున ల ♦ భించెడు, నల్పముగన్ లభించునే?

కం॥ అనుచితకర్మ మొనర్చిన,
ధనికులతో బలులతోడఁ ♦ దగని విరోధం
బున కొగ్గిన, గాంతల న
మ్మిన నిక్కంబుగ నకాల ♦ మృత్యువు వచ్చున్.

గీ॥ ఱాఁగయగు భార్యతోఁ గాపు ♦ రంబు తగదు
హీనుఁ డగువాని స్నేహంబు ♦ నెన్నఁదగదు
చెలఁగి మాఱాడు భృత్యుని ♦ నిలుపఁ దగదు
సర్పము మెలంగు నింట వా ♦ సంబు దగదు.

గీ॥ న్యాయమార్గంబు విడువని ♦ యార్యవరుని
సన్నిధిం జేరి తోడ్పడు ♦ జంతువులును,
న్యాయమార్గంబుఁ బాసిన ♦ యల్పమతిని
నాదరింపక విడుచుఁబో ♦ సోదరుండు.

కం॥ సమధికమగు నెయ్యము, వి
య్యముఁ, గయ్యము, మంతనంబు ♦ నాటయు, సంభో
గము, సద్విద్యాభ్యాసము
సములకు శోభిల్లునండ్రు ♦ సరసకవీంద్రుల్.

గీ॥ బాంధవులుఁ, బ్రేమ దైవారఁ ♦ బ్రాణసఖులు,
విద్యయును, గౌరవము, లేని ♦ విషయమునను,
ఒక్క క్షణమైన నిలువకు ♦ మోయి సఖుఁడ
నిలిచినన్ హాని యందురు ♦ నిపుణమతులు.

గీ॥ మూర్ఖుఁడగు శిష్యునకుఁ జేయు ♦ బోధనమున
దుష్టయగు భార్యను భరించు ♦ కష్టమునను

ఉద్ధతుల శత్రువుల సంపత్తి ♦ యోగమునను
దుఃఖభాజనుండగుఁ బండి ♦ తుండు నైన,

గీ॥ గణకులం దిట్టు, రుజనున్న ♦ కలిమివాఁడు
ఉఱక వైద్యులఁ దిట్టు రుజా ♦ నున్న రోగి
సంపదయు నాయువుం బోవు ♦ సమయమునను
బ్రాహ్మణ ద్వేషముం బూనుఁ ♦ బార్థివుండు.

గీ॥ ఆత్మఁ బుట్టినబుద్ధి సౌ ♦ ఖ్యఫలసిద్ధి
మఱియు సద్గురు బుద్ధి సం ♦ పత్సమృద్ధి
పరులు బోధించు బుద్ధి యా ♦ పత్ప్రసిద్ధి
ప్రమదలకుఁ బుట్టు దుర్బుద్ధి ♦ ప్రళయవృద్ధి.

గీ॥ తనకు ననుకూలుఁడగు సుహృ ♦ ద్వరునితోడఁ
దనకు ననుకూలవతియైన ♦ తరుణితోడ
వినయ విశ్వాసములఁ గొల్చు ♦ భృత్యుతోడ
సతుల గుణభూషితుండగు ♦ సధవు తోడ
జనుఁడు తనకష్టములఁ దెల్పి ♦ సౌఖ్యమొందు.

గీ॥ అన్వయాగత భూరి వి ♦ ద్యాధనంబు
నన్వయాగతైశ్వర్యంబు ♦ నలరఁగ్రాలు
పండితా ఖండలునకును ♦ ప్రభువునకును
స్వాంతమున నైనలేదు గ ♦ ర్వాతిశయము.

గీ॥ శకునమును, ధర్మమును, జ్యోతి ♦ షమును, వైద్య
మర్మములను, ప్రాయశ్చిత్త ♦ కర్మ విధుల
శాస్త్ర విజ్ఞానహీనుఁడై ♦ జనుఁడు వలికె
నేని, బ్రహ్మ ఘాతుకుఁ డండ్రు ♦ వాని బుధులు.

గీ॥ మక్షికా మూషికంబులు, ♦ మశకములును,
గణికయున్, యాచకుండును, ♦ గ్రామణియును,
గణకుఁడున్, వీర లేద్వరుం ♦ గరుణఁ బాసి,
పరుల భక్షించు వారలై ♦ బ్రదుకుచుండ్రు.

గీ॥ శాంతగుణ భూషితుండగు ♦ జనునియందు
గౌరవం బుండ నేరదు ♦ ఖలునిఁబోలి;
పాముఁ బూజించువారలే ♦ వసుధఁ గలరు
కరిని, గరుడునిఁ బూజించు ♦ ఘనులు గలరె?

గీ॥ అఖిల విద్యలఁ గఱచిన ♦ యవని సురులు,
సమర జయలక్ష్మిఁ బెండ్లాడు ♦ క్షత్రియులును,
జనులు వినుతించు నీవి చే ♦ సంపదలును,
ధరణి రాజిల్లు నందురు ♦ తత్త్వవిదులు.

గీ॥ ప్రతిదినంబును బోవలె ♦ రాజసభకు;
వ్యర్థమయ్యును తలతప్పి ♦ వచ్చెనేని
రాజ పరివార పరిచయ ♦ ప్రాప్తివలనఁ
దన యనర్థంబుఁ దొలఁగింప ♦ ననువుపడును.

గీ॥ జవ్వనంబున నెవ్వాఁడు ♦ శాంతమూను
వాని శాంతచిత్తుం డన ♦ వచ్చుఁ గాక
ధాతువులు క్షీణదశ నొందు ♦ తరుణమందుఁ
గడకు నెవ్వాఁడు శాంతుండు ♦ గాకయుండు.

గీ॥ తండ్రి బుణకర్త యైన శ ♦ త్రువునిఁ బోలు
జనని వ్యభిచారిణియు నైన ♦ శత్రువగును
రూపవతియైన భార్య శ ♦ త్రువుని మించుఁ
బుత్త్రుఁడును శాత్రవుండగు ♦ మూర్ఖుఁడైన.

గీ॥ వాక్కు పరుషంబుగానున్న ♦ ధిక్కరింత్రు
మధుర వాక్కులఁ బలికిన ♦ మనుజులెల్లఁ
దనకు ననుకూల మిత్రులె ♦ తనపు మంత్రు
కాకిఁ గోకిలం గనుఁడు తా ♦ ర్కాణమునకు.

గీ॥ గృహిణి లేకున్న గేస్తున ♦ కేల గృహము?
పుత్త్రసంతతి లేని క ♦ ళత్రమేల?

వినయ విశ్వాసములు లేని ♦ తనుజుఁడేల ?
జాతకము లేని జ్యోతిష ♦ చర్చయేల ?.

గీ॥ దౌర్బలునిపొంత కేగఁడు ♦ దుర్జనుండు
దుర్బలుని పెం పణంపంగఁ ♦ దొడరుచుండు
నశ్వము, గజంబు, వ్యాఘ్రింబు, ♦ హరియు, గండ
బలికి మేకనే కోరు, దే ♦ వతయు నకటా.

గీ॥ రాజ్యము నశించునందు ద్రు ♦ ర్మంత్రివలన!
గ్రామము నశించు మద కుంజ ♦ రంబువలనఁ
గలిమి వినశించునందు మ్రా ♦ తులునివలన,
సకలము నశించునందు స్త్యా ♦ లకుని వలన.

గీ॥ ఖలునియందు రహస్యంబు, ♦ జలమునందు
తైలమున్, బ్రాజ్ఞునందు శా ♦ స్త్రంబు వనము
నందు దావాగ్నియున్, దమ ♦ యంతఁ దామె
స్థానబలమును బట్టి వి ♦ స్తారమగును.

గీ॥ మద్య ముద్యోగ మాహార ♦ మైథునములు,
ద్యూతమున్, బోరితంబుఁ గం ♦ దూతి, నిద్ర,
పరసతీ భోగ వాంఛయు; ♦ నరుల కిలను
వృద్ధిఁబొందుచు నుండు సే ♦ వించుకొలఁది.

గీ॥ చక్కఁదనముచేఁ గాంత నా ♦ శనముఁజెందు
రాజసేవచే వినశించు ♦ బ్రాహ్మణుండు
ఆవులు నశించుఁ జాల ద ♦ వ్వరిగెనేని
నాస్తియు నశించు నమిత లా ♦ భాశవలన.

గీ॥ అలువులయ్యును గులజులఁ ♦ గలసిమెలసి
అలరుచుండుట తనకు శ్రే ♦ యస్కరంబు;
ఊకఁబాసిన తండులం ♦ బుర్వియందు
మొలకలెత్తును నే? తారా ♦ మునకుఁ గనుఁడు,

గీ॥ అలుపములెయయ్యు వస్తువుల్ ♦ గలసియున్న
నెట్టికార్యంబు సాధింప ♦ నేపుఁజూపుఁ
దృణములు గుణత్వముంబొందె ♦ నేని, నట్టి
సమదగజమును బంధింపఁ ♦ జాలుఁగాదె?

గీ॥ తోడ్పడిన పూరుషున్, గృతా ♦ ర్థుండు దెగడు
నాలివలపునఁ దల్లి, నో ♦ నాదు సుతుడు
విభునియందు జాతాపత్య, ♦ ద్వేషమూను
రోగముగతించినంత నా ♦ రోగ్యశాలి
ధీరుఁడై వైద్యవర్యుని ♦ ధిక్కరించు.

గీ॥ బాలురకు, రాజులకు, ధన ♦ వంతులకును
వనితులకు, వృద్ధులకు, దపో ♦ వంతులకును
గురువులకు, మూర్ఖులకు, నీతి ♦ కోవిదులకు
నెన్నఁడు నెదిర్చియుత్తరం ♦ బీయఁదగదు.

గీ॥ కాంతయున్, గీర్తియున్, బుత్రి ♦ సంతతియును
పాడియున్, బంటయున్ ♦ దోటవలనిఫలము
భూరినిక్షేప మీయేడుఁ ♦ బూర్వపుణ్య
వశమున లభించుఁ దననేర్పు ♦ వలనుపడదు.

కం॥ రాజెవ్విధిమెలఁగిన భూ
మీజను లది లెస్స యనుచు ♦ మెలఁగుదురు "యథా
రాజాతథాప్రజా" యని
ధీజనులు వచించు పద్ధ ♦ తిన్ మునువినమో?

గీ॥ ఓర్పునకుసాటియగు తపం ♦ బొప్పదెందుఁ
దృప్తిమించిన సౌఖ్యంబు ♦ పృథ్విలేదు
అధికమగు నాశకంటెను ♦ వ్యాధిలేదు
దయనుమీఱినధర్మంబు ♦ తనరఁబోదు.

మ॥ వినయం బుండిన విత్తముండదచటన్ ♦ విత్తంబు దీపించినన్
వినయం బుండదు, లక్ష్మియున్ వినయమున్ ♦ బెంపొందుఁ బో యందు వా
గ్వనితన్ జూడము; సర్వసద్గుణ గణ ♦ భ్రాజిష్ణు సృష్టింప న
వ్వనజాత్రోద్భవుఁ డేటికో మఱచె వి ♦ ద్వాంసుల్ విచారింపఁగన్.

సీ॥ కఫ పిత్త వాత వి ♦ కార జాతంబంచు
నెలమి వైద్యులు మందు ♦ లిచ్చుచుండ్రు;
గ్రహచారవశమునఁ ♦ గలిగిన దంచు జ్యో
తిర్విదుల్ గ్రహగతిం ♦ దెలుపుచుండ్రు;
భూతాభిషంగ సం ♦ భూత రోగంబంచు
మంత్రి తంత్రిజ్ఞులు ♦ మలయుచుండ్రు;
గతజన్మ సంచిత ♦ కర్మ దోషంబంచుఁ
దెలఁగి తత్త్వజ్ఞులు ♦ పలుకుచుండ్రు;

గీ॥ ఇంక సందేహ మేటికి ♦ దృష్టి దోష
వశమున జనించె నని వృద్ధ ♦ వనిత లంద్రు;
అక్కటా! రోగ మెవ్విధి ♦ నణఁగుననుచు
నాత్మఁ జింతించుచుండును ♦ వ్యాధితుండు.

గీ॥ జాతకీయ క్షుధా వ్యధా ♦ శాంతికొఱకు
శీఘ్రముగ రాజగృహమును ♦ జేరుకొంటి;
నెలమి మందస్మితాస్యుని ♦ నృపునిఁ గంటి;
నలరుఁ దేనియ లూఱు మా ♦ టలను వింటి;
నకట! యాకొంటి యత్నంబు ♦ వ్యర్థమంటి.

గీ॥ బ్రాహ్మణుం డగ్ని, వారాశి, ♦ రాజు, యముఁడు
జఠరము, గృహంబు, నను నట్టి ♦ సప్తనిధుల
నెల్లవిధముల యత్నించి ♦ యెవ్వఁడేని
నింపఁజాలునె తన నేర్పు ♦ నివ్వటిల్ల.

గీ॥ ధనమునన్ భోజనంబున ♦ దారయందుఁ
బురుషుఁ డీమూట నంతృప్తిఁ ♦ బొందవలయు
దానమునను, సద్విద్యను ♦ తపమునందుఁ
బురుషుఁ డెన్నఁడు సంతృప్తిఁ ♦ బొందరాదు.

గీ॥ వరకులంబున జన్మించి ♦ సిరులఁబడసి
ఇంద్రియంబుల సౌష్ఠవం ♦ బెనసియుండి
ఎవ్వఁ డాత్మ హితంబు గ్రి ♦ హింపకుండు
నాత్మఘాతుకుఁ డమ్మూఢుఁ ♦ డనిరియుండ్రు.

గీ॥ మంచిమాటలఁజెప్పి బో ♦ ధించినంత
సుజనునిం బోలఁజాలునె ♦ కుజనుఁడెందు;
గాంగ శీకర స్నాపిత ♦ గార్దభంబు
ఉత్త మాశ్వంబు కరణిఁ బ ♦ ర్వెత్తఁగలదె?.

గీ॥ సంపదయు, సత్స్వభావంబు ♦ సంతతియును
సత్యమును, సరస్వతియు స ♦ జ్జనుల మైత్రి
సద్గతియు, నాఁబడు సకార ♦ సప్తకంబు
వసుధ లభియించునే యెట్టి ♦ వానికైన?.

చం॥ ధనము జనాళికిన్, గరికి ♦ దంతములున్, ఫలముల్ కుజాళికిన్
వనితల కందమున్ మృగగ ♦ ణంబునకున్ జలలంబు, ఘోర ద
ర్శనమునకున్ గజాదికినిఁ ♦ జర్మము, చిల్కకు ముద్దుపల్కులున్
అనయము నిన్నియున్ గుణము ♦ లయ్యు విరోధకరంబు లక్కటా!.

గీ॥ ఇంద్రుఁడవు చంద్రుఁడవు నీవు ♦ వేంద్రుఁడవని
ధనికుని నుతించు మనుజుండు ♦ ధనముఁగోరి;
ఈశ్వరుని నట్లు వినుతించు ♦ నేని, ఘోర
సంసరణవార్ధిఁ దరియింపఁ ♦ జాలుఁ గాదె?

గీ॥ సుతునిమించిన లాభ మె ♦ చ్చోటఁ గనము,
ఆలికంటెను హెచ్చు సౌ ♦ ఖ్యంబులేదు

ధర్మమునుమీఱు సాయంబు ♦ తనరఁబోదు
అనృతమును బోలు పాతకం ♦ బవని లేదు.

ఉ॥ స్త్రీలు,ధనంబు,యౌవనము,♦ సేవయు,దుష్టులతోడి మైత్రియున్
చేల లభించు పంటయును,♦చెన్నుగఁ బ్రిబ్బిన మబ్బు నీడ,పై
పోయిన నున్కి, తజ్జనుల♦పొందిక యున్ బరికించి లేని మీా
పాలకు నంటు తేనియల♦చందమునన్ మదికింపు నింపెడున్.

చం॥ ఇతరునిపోల్కి బంధుజనుఁ♦డేనియుఁ దోఁచు హితంబు లేక, స్నే
హితుఁడగు పూరుషుం డితరుఁ♦డేనియు మిక్కిలి ప్రీతిఁగూర్చు;రు
గ్ణత యహితంబుగాదె నిజ♦గాత్రిజమయ్యు, మహౌషధం బొగిన్
హితముగనుంకుఁగాన జని♦యించినదయ్యు; నదేమి చిత్రమో?.

గీ॥ వరునఁదప్పని జలబిందు ♦ పాతమునను
ఘటమునిండు చందాన జ ♦ గానఁ దనకు
ధనము, ధర్మంబు, విద్యయు ♦ ననుభవంబుఁ
గ్రమముగ లభించు నాసక్తిఁ ♦ గలిగియున్న.

ఉ॥ పరులకు నంకుశంబయిన ♦ బల్మిని, ధర్మముఁ దప్పనట్టి భూ
వరుఁడు, విరాగియైన వర ♦ పండితుఁడున్, పతిభక్తిఁగ్రాలు స
త్తరుణియుఁ, గల్మితోనలరు ♦ దాతయు, శస్త్రుని పాత వేళలన్
వెలవక నిల్చు వారువము ♦ పృథ్వికి నాభరణంబు లారయన్.

గీ॥ పీనజఘనస్తనంబుల ♦ పెంపుఁగాంచు
సత్కులాంగన వస్త్ర వి ♦ స్తారమునకుఁ
దనివిఁగాంచని చందాన ♦ దాత, తనకు
నెంత ధనమున్నఁ జాల దం ♦ చేవగించు.

గీ॥ కమలగర్భుని నిరసించి ♦ ఘనత కెక్క
శిల్పి శిల్పచాతుర్య వి ♦ శేషమునను
స్వర్ణకమలంబుల సృజింప ♦ వచ్చుఁగాక
పరిమళంబును బుట్టింప ♦ వలఁతి యగునె ?

గీ॥ జనుఁడు, నిజదేశకవియొక్కి • ఘనతఁగనిన
నన్యదేశీయునిన్ మెచ్చి • యాదరించుఁ;
దనకులాంగన చక్కని • తరుణియయ్యు,
నన్యకాంతను వీక్షించి • యలరు విటుఁడు.

గీ. బోనమిడినంత నెంతటి • పూరుషుఁడును
మధురవాక్కులఁ బ్రీణింతిఁచు • మనుజుఁబోచి;
మోమునం బోన మిసుమంత • పూసినంత
వరమృదంగంబు మధురార • వంబుఁ జేయు.

గీ. జారునకుఁ జోరునకు వైరి • చందురుండు,
మూర్ఖుఁడగు శిష్యునకు వైరి • బోధకుండు,
జారయగు భార్యకున్ భర్త • శాత్రవుండు,
యమునిఁబోలును లోభికి • యాచకుండు.

గీ॥ తాపఘర్షణచ్ఛేదన • తాడనముల
స్వర్ణమును బరీక్షించెదు • చందముననె
తొలుత శ్రుత శీలకులకర్మ • ములనుబట్టి
పురుషుఁ బరికింపవలెనండ్రు • సరసజనులు.

గీ॥ అరయ మంత్రింబుగాని య • క్షరములేదు
ఔషధముకాని మూలిక • యవనిలేదు
అక్కఱకురాదు పూరుషుం • డనఁగరాదు
యోజకుండెవ్వఁడిలఁ దత్త్వ • యోగమునకు?.

గీ॥ అకట! భూపాలుఁడవివేకి • యయ్యెనేని
నాశ్రితులయందు సుగుణంబు • లణఁగుఁగాదె?
పతి, నపుంసకుఁ డయ్యెనేన్ • సతికినెందు
హావ భావ విలాసంబు లలరఁ•గలవె?.

గీ॥ బ్రాహ్మణుల కల్పవృక్షమా! • భాదరిపక్ష
మా! మముంబాసి యేచాయ • కరిగితకట!

వార్ధి డిండీరపాండుర ♦ వర్ణతుల్య
పాయసఘృతాన్న భోజన ♦ ప్రాప్తితోలఁగ.

ఉ॥ "పాలనుబోలునీయశముఁ ♦ బండితులున్ గవులున్ నుతింపఁగన్
హేళిని విన్నవార లెవ ♦ రౌ దల లూపక యుందురంచు లోఁ
జాలభయంబుఁ జెంది యల ♦ సారసగర్భుఁడు భూమిఁబోలిన భూ
పాలక! యాలకింపు మహి ♦ వర్యసృజించెను కర్ణహీనుఁగా".
(అని యొక కవి రాజు బొగడెను.)

సీ॥ సద్విద్యలకునెల్ల ♦ సత్కవిత్వము రత్న
మాకాశతలరత్న ♦ మబ్జహితుఁడు,
పండితవర్యుండు ♦ వరసభారత్నంబు,
శ్రవణరత్నంబు భా ♦ గవతగాథ,
యామినీరత్నంబు ♦ యామినీకరుఁడు, శ
య్యారత్న మంభోరు ♦ హాయతాక్షి,
జాజిపూవఖిల పు ♦ ష్పములకురత్నంబు
తరులకెల్ల ర ♦ త్నంబురంభ,
గీ॥ కాళిదాసుండు రత్నంబు ♦ కవులకెల్ల,
సకలఋతురత్నమరయ వ ♦ సంతఋతువు,
దైవములకెల్ల రత్నంబు ♦ దైత్యవైరి,
రాజవరులకు రత్నంబు ♦ రాఘవుండు.

మ॥ "వినుమోయీయధికారి! యాచకుల,నీ ♦ విందన్నుఁమాత్రీయులన్
గనిపేర్మింపుము, సాధుబంధుజన స ♦ త్కారంబుఁ గావింపుమేన్,
నినువర్ణించితినేని, నిన్ జనులు మ ♦ న్నింపంగరారంచు" లే
ఖని నీపీనులఁ జెప్పుచున్నది, మదిన్ ♦ గీడెంచి మేలెంచుమా"
(అని యొకఁడు పీనులఁగలముఁబెట్టుకొనియున్న యుద్యోగిఁజూచి
పలుకుచున్నాఁడు)

గీ॥ ధర్మముఁ బొనర్ప నెన్నండుఁ ♦ దలఁపఁబోరు
మాట మాత్రంబునకునైన ♦ మనుజులకట,

పాపమున నుద్యమింతురు; ♦ స్వాంత మెపుడు
దండుగకునొప్పు, నొప్పదు ♦ ధర్మమునకు.

గీ॥ వినియు నూహింపఁజాలని ♦ మనుజునెడల
నార్యులు వచించు వాక్యంబు ♦ వ్యర్థమగును;
అక్కటా! భర్త జాత్యంధుఁ ♦ డయ్యెనేని
సతివ యందంబు చందంబు ♦ వ్యర్థమగును.

గీ॥ విజయలక్ష్మిని వరియించు ♦ వీరవరుఁడు,
వాణికరుణను భాషించు ♦ పండితుండుఁ,
జూచినంతనె వలపించు ♦ సుందరాంగి,
గౌరవించెదరన్యులె ♦ క్కడకుఁజనిన.

గీ॥ వసుధఁ జీమయు, దయ్యంబు, ♦ వైష్ణవుండు,
మత్కుణము, భస్మదర్శన ♦ మాత్రమునకు
భయము పెంపున దప్పఁగఁ ♦ బఱచుచుండ్రు;
కారణంబేమి? యూహించు ♦ వారుగలరె?

ఉ॥ మేలనవచ్చు బాల్యమున ♦ మృత్యువు, యౌవనవేళ లేమిచేఁ
జాలఁ గృశింపరాదు; వెల ♦ చాన, యణంకువఁ దప్పినట్టి యి
ల్లాలికి హెచ్చుగాదె? ఖలుఁ ♦ డౌ జననాథుని కొల్వుకంటె, నా
ప్రోలుఁ ద్యజించి కానలకుఁ ♦ బోయి తపించిన మోక్షమబ్బదే.

ఉ॥ పూల సృజించె నేమలయ ♦ భూజమునందు? మనోజ్ఞకాంతులన్
గ్రాలు పసిండికిన్ దగిన ♦ గంధ మొసంగెనె? పండితాళికిన్
శ్రీలు లభింపఁజేసెనె? సృజించెనె పండ్లను పుండ్రమందుఁ, దో
త్వేలుపు తప్పులన్ దెలుపు ♦ పెద్దలు వేలుపులందు లేరొకో?"

గీ॥ ఇంద్రలోకంబు హెచ్చేమి ♦ యేకమాత్రి
గురునితోఁ గవితోఁ గలా ♦ ధరునితోడఁ
గ్రాలు; మర్త్యలోక మనేక ♦ కవులతోడ
గురులతోఁ గలాధరులతోఁ ♦ గొమరు మిగులు.

గీ॥ ఎవని గుణములఁ బెరవార ♦ లెన్నుచుండ్రు
వాఁడు ఖలుఁడయ్యు సద్గుణ ♦ వంతుఁ డగును;
ఎవఁడు తన గుణంబులఁ దానె ♦ యెన్నుకొనునో?
హీనుఁడన నొప్పు వాఁడు దే ♦ వేంద్రుఁ డయ్యు.

గీ॥ నల్లులకు జంకి, యిందిర ♦ నలినమునను
పండుకొనియుండె; హరి క్షీర ♦ వార్ధిఁ జేరె,
మంచు కొండకుఁ బోయెను ♦ మాధవుండు,
అహహా! చలికాల మితరుల ♦ కభయ మొసఁగె.

గీ॥ శ్రితజనావనంబును, దుష్ట ♦ శిక్షణంబు,
శిష్ట రక్షణంబును రాజ ♦ చిహ్నములగు,
గంధిలాభిషేకము, వస్త్ర ♦ బంధనంబు,
వ్యజనమును లేవె? యూహింప ♦ వ్రణమునకును.

గీ॥ సతత గమనంబు వలనను ♦ సంభవించు
పరిచయంబునఁ దనగౌర ♦ వంబణంగు;
మలయగిరి భిల్ల కామిని ♦ మలయజంబు
నింధనోప యోగంబున ♦ కెలమిఁ దుంచు.

చం॥ పరసతిఁ గోర రాదనుచుఁ ♦ బాతకమంచెఱుఁగండె రావణుం
డరయనివాఁడె ధర్మజుఁడ♦ హంకృతిఁ గేళికిఁ జొచ్చె? జానకీ
వరుడవివేకి యే యకట! ♦ బంగరు లేడికి నాసఁజెందె ? సు
స్థిరమతికైన, జ్ఞానము న ♦ శించును నేగి ఘటిల్లు వేళలన్.

గీ॥ హీనుఁడయ్యును, విద్యా వి ♦ హీనుఁడయ్యు,
నీచకుల సంభవుండయ్యు, ♦ నియతిలేని
వాఁడ యయ్యుఁ జేరువ నున్న ♦ వానిఁ జేరుఁ
గామినీ వల్లికలఁబోలి ♦ క్ష్మావరుండు.

మ॥ పరులన్ బట్టుకొనంగ, భీతిలి వడిన్ ♦ బశ్వోత్తు గుఱ్ఱంబు వే
మరలింపంగ, ధనుస్సు, డాలును, ధరిం♦పన్ జాలు డాకేలు; దు

పకారకృత్యంబులఁజేయుదక్షిణము; త్యాగంబొంతు లేకుండుటన్
సరసీజోద్భవుఁడుంచె వామకరమున్ ♦ శౌచాధికారంబునన్.

గీ॥ వసువు లంగల మండల ♦ ప్రభువులయ్యు
బహుళ దారిద్ర్యముంబొందు ♦ వారు లేరొ?
దినము విభజించి వరుసగ ♦ నినుఁడు, రాజు
నలరుచున్నార తార! యే ♦ కాంబరమున.

గీ॥ శీలభారంబునన్ గాంత ♦ చెలువు మీఱుఁ
బుష్పభారంబునన్ వల్లి ♦ పొలుపుఁ దెలుపు
నర్థభారంబునన్ వాణి ♦ యలరుచుండు
నెవ్వఁడీ మూఁడు-సంపద ♦ లెనయఁ గలఁడొ?

గీ॥ కవులఁ బూర్వుల, లెక్కింపఁ ♦ గాళిదాస
కవి, కనిష్ఠికాధిష్ఠిత ♦ ఘనతఁ గొనియె,
వాని సరియైన కవి ధాత్రి ♦ లేని కతన
సార్థవతియై యనామిక, ♦ యవని నుండె.

గీ॥ ఎలమి నెవ్వానిచేఁ గాంత ♦ యలరఁ గలదొ?
వాఁడె పూరుషుఁ డనఁజెల్లు ♦ వసుధ యందు;
రసికుఁడే శ్లోకమునకు నిం ♦ పెసఁగ నలరు
నదియు, సుశ్లోకమని యందు ♦ రార్య వరులు.

గీ॥ గురుకృపాలబ్ధ సాహితీ ♦ గరిమఁ గ్రాలు
కవివరేణ్యుండె యయ్యు, ని ♦ క్కముగ నితర
పండితులు బాగు బాగను ♦ వఱకు నెట్టి
కవికిఁ దృప్తి యుండదు తన ♦ కవిత యందు.

మ॥ ధన హీనుండును, నేత్రహీనుఁడును, కాం ♦ తాహీనుఁడౌ దీనునిన్
గని విశ్వేశ్వరుఁ "డోయియొండువరమున్ ♦ గాంక్షింపు" మన్నంతనే
విని యాతండనె నిట్లు "భక్త వరదా! ♦ వీక్షింపఁ గాంక్షించెదన్
జనులొహో యన ఛత్రచామరములన్ ♦ రాజిల్లు సత్పుత్త్రినిన్.

గీ॥ చిత్త మిగురొత్తఁ దనకెంత ♦ విత్తమున్నఁ
గృపణుఁ డనుభవింపఁడు గాదె ♦ దృష్టిఁదీఱ;
నహహా! యాకంత జలమగ్న ♦ మయ్యు శునక
మానఁజాలక జలము జి ♦ హ్వను స్పృశించు.

ఆ॥ వె॥ అబల ప్రబలయైన, ♦ నధిపుండు ఖలుఁడైనఁ
జదువులేని మంత్రి ♦ సంఘటిలిన,
వైద్యవృత్తి యకట ♦ వర్తకంబైనచోఁ
బ్రాణ విత్తములకు ♦ హాని యొదవు.

చం॥ కలిమికి బల్మికిన్ గనులఁ ♦ గానక సంచరియింతు, ర్దైవమున్
దలఁపరు, లోభ చిత్తులయి ♦ దానము నెన్నరు, లేని వేళలన్
దలఁతురు; కాంత యౌవన మదంబున భర్తను ధిక్కరించి, మా
యలఁ బచరించి; వృద్ధ యయి ♦ నంతఁ బతివ్రతఁబోలునై నడెన్.

మ॥ "వర సౌప్సారగ సీధు గంధ లలనా ♦ వస్త్రాన్నపానాదినై
బలిమిన్ నిర్భర మన్మథోత్సవ సుఖ ♦ ప్రారంభ సంరంభినై
అలరం జొచ్చితి, వెచ్చఁబెట్టితి శరీ ♦ రారోగ్యమున్ భాగ్యమున్;
భళిరా! యిప్పుడు మోక్షకాముడనయి దైవంబున్ బ్రశంసించెదన్"
(ఇట్లొక వృద్ధుని పశ్చాత్తాపము)

చం॥ జనులకుఁజూడ సర్వగుణ ♦ సంపద రాజిల దొక్క ప్రజ్ఞచే
ఘనమగు కీర్తి చేకురు జ ♦ గంబున; గేతకి పండ్ల నీను నే?
పనసకు సౌరభ ప్రవ ♦ వైభవ మున్నదె? నాగవల్లికన్
గనఁగొనఁ బండ్లఁ బూవులను ♦ గాయలు నె? గౌరవమొందకున్న వే?

గీ॥ సంతతానుయాతానేక ♦ జనులతోడ
సన్నజనభృత దేహుఁడై ♦ యరుగుచుండు;
బోల్చి చూడంగ నధికార ♦ పురుషునకును
శవమునకు భేద మున్నదే ♦ జగమునందు?

గీ॥ ఇరుపురం బెండ్లి యాడి కా ♦ పురము సేయు
వాని దురవస్థ వర్ణింప ♦ వశమె మనకు;

బిలముబహిరంతముల నుండు ♦ పిల్లి కపిని
నడుమఁ జిక్కిన యెలుక చం ♦ దాననుండు.

గీ॥ సతముఁ గ్రూరుండు, వక్రుండు, ♦ షష్ఠరాశి
యందు వర్తించు, శనిఁ దృతీ ♦ యంబుఁ గోరుఁ,
బదునొకండవ రాశికి ♦ బయలుపడును;
పదియవ గ్రహంబు జామాత ♦ వసుధయందు.

గీ॥ స్వర్గము తృణంబు, బ్రహ్మవి ♦ జ్ఞానునకుఁ,
బ్రాణము తృణంబు సమర వి ♦ హారమతికి,
నూర్ధ్వరేతస్సు గలవాని ♦ కువిద తృణము,
సంసరణ నిస్పృహునకు ము ♦ జ్జగము తృణము.

చం॥ ధరణి జనాళి కెయ్యది మ ♦ దంబు జనింపఁగనీయ దయ్యదే
సిరి యననొప్పు, నాశను త్య ♦ జించిన యాతఁడె భాగ్యశాలి, యె
ప్పరుసున విశ్వసింపఁదగు ♦ వాఁడె సఖుండగు, గామ లీలలన్
బారయక స్థైర్యచిత్తుఁడగు ♦ పూరుషుఁడే విజితేంద్రియుండగున్.

గీ॥ సత్కులజునకుఁ గన్య నొ ♦ సంగవలయుఁ,
గళల శిక్షితుఁ గావింప ♦ వలయు సుతుని,
దుష్టులకుఁ గూర్పవలయును ♦ కష్టములను,
చిత్తమును ధర్మపథమును ♦ జేర్పవలయు.

గీ॥ కరుణ దైనార నొకవేళ ♦ గారవించుఁ,
గోపమున నొక్కతఱిఁ ద్రోయుఁ ♦ గూపమునను,
అవ్యవస్థిత చిత్తుల ♦ యత్యనుగ్ర
హాగ్రహంబులను గ్రహింప ♦ నజుని వశమె?

గీ॥ దెబ్బగలచోట మఱియొందు ♦ దెబ్బతగులు,
లచ్చితొలఁగిన జఠరాగ్ని ♦ హెచ్చు పెరుఁగు,
నాపదలయందు వైరమ ♦ త్యధికమగును,
సంకటమునందనిష్టంబు ♦ సంభవించు.

గీ॥ అళికులంబు సుగంధంబు ♦ ననుసరించు,
వినయగుణ భూషితుని లక్ష్మి ♦ యనుసరించు,
శంబువులు నిమ్నమగు భూమి ♦ ననుసరించు,
నజుని లిఖితంబుఁ దన బుద్ధి ♦ యనుసరించు.

గీ॥ వసుధఁ జౌర్యంబు, జూదంబు, ♦ వర్తకంబు,
నతుల మంత్రిశాస్త్రంబు, రా ♦ జాశ్రయంబుఁ,
దౌలుత నీమైదు నత్యంత ♦ ఫలమొసంగుఁ;
నంతకంతకు ఘటియించు ♦ నధిక హాని.

గీ॥ భారతీదేవి కింగల ♦ వలుఁద చనులు
హృద్య సంగీత సాహిత్య ♦ విద్యలందుఁ;
గీత మనునది జనుల కా ♦ పాత మధుర
మరయ సాహిత్య మాలోచ ♦ నామృతంబు.

గీ॥ పరముఖంబుల వీక్షించు ♦ పడఁతి యొండు,
జ్ఞాన మావంతయును లేని ♦ కవియొకండు,
పథ్యపానంబు లరయని ♦ వ్యాధితుండు,
నకట! అకు రానివారని ♦ యార్యు లందురు.

గీ॥ ధృతి వహించినవాఁడును ♦ దీర్ఘరోగి
వైద్యునకు లాభముంగూర్చు ♦ వారు గారు;
ధృతి విహీనుండు మఱియు న♦ దీర్ఘరోగి
వైద్యునకు లాభముం గూర్చు ♦ వార లరయ.

గీ॥ వైద్య దంభంబుఁ గలవాఁడు ♦ వ్యాధితునకు
ధైర్యము, నధైర్యము, నొసంగఁ ♦ దగదు తగదు;
ధైర్యముండిన, లేక, య ♦ ధైర్యమున్న
ధనమొసంగఁడు రోగి వై ♦ ద్యునకు నకట!.

గీ॥ "కఠిన పథ్యంబ"ని వచించి ♦ కపటవైద్యుఁ
డెట్టి దుష్టౌషధమునైన ♦ నిచ్చుచుండు;

వ్యాధితుఁడు చచ్చెనేని న ♦ పథ్య దోష
మనుచు వచియించుఁ, బ్రదికిన ♦ ఘనతఁగాంచు.

శా॥ దైవజ్ఞత్వము, మాంత్రికత్వమును, తం♦త్రప్రజ్ఞయున్ వైద్య వి
ద్యా వైశద్యము, చాటుకౌశలము, స♦వ్యాపార, మొక్కొక్కటే
వేవిత్తంబును గూర్చు, నంతకుఁబయిన్♦విద్యాబలం బొందినన్
శ్రీవైవశ్యముఁబొందు మానవుఁడు ని♦క్షేపంబు ప్రాప్తించెనాన్.

గీ॥ కవివరప్రోక్త కథనంబు ♦ గ్రామమునకొ,
వరగజాశ్వములకొ, లేక ♦ వస్త్రమునకొ,
భోజనప్రాప్తికొఱకొ, తాం ♦ బూలమునకొ,
అక్కఱకు వచ్చుచున్నది ♦ యవనియందు.

గీ॥ పుత్త్రవతులగు నిరువురు ♦ పొఁతులున్న,
భర్తృహీనయై దుఃఖించు ♦ భగినియున్న,
సంతతము సంటఁ గలహంబు ♦ జరుగుచుండు
దాని సైరింప శక్యంబె ? ♦ ధాతకైన.

గీ॥ మించి మరణకాలము సమీ ♦ పించుదనుకఁ
బ్రాణుల యముండు బాధింపఁ ♦ బాలుపడఁడు;
కాల నియమంబుఁ దప్పి యె ♦ క్కుడకుఁ జనిన
ధనము ధన మంచు ఋణదాత ♦ తగవులాడు.

గీ॥ బహుముఖంబుల జఠరాగ్ని ♦ ప్రజ్వలించె,
నెలమి శీతోష్ణములను స ♦ హింపఁజేసె,
నడుమ శక్తియుఁ బుట్టించె, ♦ జడత మాన్చె,
నహహా ! దారిద్ర్యమతుల సి ♦ ద్ధౌషధంబు.

గీ॥ క్షణము మాత్రంబ యుండును ♦ గ్రహమదంబు,
యామమాత్రంబ యుండు సు ♦ రామదంబు,
నడుమఁ గలిగిన సంపదు ♦ న్మాద మదము
చచ్చుపర్యంతముండు దు♦ర్జనుల కకట.

గీ॥ జనుల వంచించి యార్జించు ♦ ధనమదాంధుఁ
డై దుగవ్వల యీవికి ♦ నతిశయించి
సర్వశాస్త్రంబులం దాను ♦ చదివినట్లు
పండితుల ధిక్కరించు వా ♦ గ్వాదమునను.

గీ॥ హస్తమున జపమాలిక ♦ నవధరించి,
నడుమ నడుమను తనదు క ♦ న్గవను మోడ్చి,
బ్రహ్మమయమంచుఁ దత్వ ము ♦ పన్యసించు
వాఁడు వేదాంతి యను ఖ్యాతిఁ ♦ బడయఁజాలు.

సీ॥ అతుల శిష్టాచార ♦ మని పల్కి తులసి మృత్
త్తాళనపత్రికియల్ ♦ జరుపుటయును,
ధ్యానంబు నటియించి ♦ స్నానంబుఁ గావించి
దట్టంబుగా భూతిఁ ♦ దాల్చుటయును,
చాల దవ్వుగనున్న ♦ మాలను వీక్షించి
గట్టిగాఁ బొమ్మంచుఁ ♦ దిట్టుటయును,
అన్యులు వీక్షించు ♦ నంత పర్యంతము
నిత్యకర్మంబును ♦ నెఱపుటయును,

గీ॥ దేవతార్చన మనుచును ♦ దినము దినముఁ
గాలమంతయు వమ్ముగఁ ♦ గడపుటయును,
పామరులు మెచ్చ గౌర వా ♦ స్పదము లయ్యె
విద్యలేనట్టి వైదిక ♦ వేషమునకు.

ఉ॥ "ప్రాయము మించె, వార్ధకము ♦ వచ్చె, నొనర్చిన పాతకంబు ల
న్యాయకృతంబు" లంచు మది ♦ నారసి కాలునిభీతిఁ జెంది "నా
రాయణ! వాసుదేవ! రఘు ♦ రామ! దయానిధి" యంచు వృద్ధుఁడా!
వేయి పఠింతు వీవనుభ ♦ వింపవొ? యాత్మ కృతాపరాధమున్.

గీ॥ ధర్మమిదఁ బూని యార్జించి ♦ ధనచయంబు,
భార్య పచియింపు మనది వేద ♦ వాక్యమను చుఁ,

తనకుఁ దోఁచినదే ధర్మ ♦ మనుచు మేలగు
నపరకలికి నమస్కార ♦ మాచరింతు.

## నవరసములు — శృంగారము

సీ॥ లలితలావణ్య లీ ♦ లా జల సంభూత
కమలంబుగాని, ము ♦ ఖంబుగాదు,
కందోయి విందుగఁ ♦ గ్రాలు నవ్వి వ్వాణాల
యుగళంబుగాని, బా ♦ హువులు గావు;
విరహులంజిక్కులఁ ♦ బెట్టెడు శైవాల
చయమగుఁగాని, కే ♦ శంబుగాదు,
శృంగారజలమున ♦ నెలమి నటించు మ
త్స్యంబులు గాని నే ♦ త్రములు గావు
గీ॥ మదనబాణాగ్ని సంతప్త ♦ మానవులకుఁ
జెలువుమీఱు శ్రోణీతీర్థ ♦ శిలలతోడ
బ్రహ్మనిర్మించు సోకసరో ♦ వరముగాని;
నెలఁత గాదీమె యియ్యది ♦ నిశ్చయంబు,
ఉ॥ చంపకగంధి! చంద్రముఖి!♦చంద్రుని రాహువు మింగఁజోవు. నీ
సొంపలరారుమోముఁ బరి ♦ శుద్ధ నవేందునిఁ గాఁదలంచి, భ
క్షింపగరాహు వింకగమ ♦ కించు, శశాంకుఁడీఁ జూచునే? ప్రవే
శింపుము గేహమందు సతి ♦ శీఘ్రముగన్, వెలి నుండవచ్చునే?
మ॥ జడుఁడై వేదములన్ బఠించు నల య ♦ బ్జాతాసనుం డేడ? న
న్నుఁడు నేకాంతలఁజూడ మిట్టివర సౌ ♦ న్దర్యంబు నిర్మించు టె
క్కడ? గౌరీహృదయేశుఁడీశ్వరుఁడు తన్♦గాఱించునంచున్ భయం
పడి పుష్పాయుధుఁడీగతిన్ యువతి రూ♦పంబూనె నిక్కంబుగన్.

—: సఖీ కర్తృక మానాపనోదనము :—

సీ॥ ప్రియుఁడు నీపైఁగూర్మి ♦ వెలయించి యలరింపఁ
బరుషవాక్కులనీవు ♦ పలుకఁదగునె?

ప్రాణనాథుఁడు నమ్రుఁ • డై నిన్ను వినుతింప
నిశ్చేష్టవై నీవు • నిలువఁదగునె?
ననుపుకాఁడనురాగ • మనుకూలుఁడై చూప
ద్వేషభావము నీవు • తెలుపఁదగునె?
ప్రమదంబునను భర్త • సుముఖుఁడై దరిఁజేర
విముఖత్వమున నీవు • వెడలఁదగునె?.

గీ॥ అందుచేఁగాదె విషమయ్యెఁ • జందనంబు,
అక్కటక్కట! పన్నీర • మగ్నియయ్యె,
నమృతకిరణుండు చండ మా • ర్తాండుఁడయ్యెఁ,
దుఃఖకరమయ్యెఁ బ్రమదంబు • తోయజాక్షి!.

(అనియొక చెలికత్తె ప్రియునిఁ గోపించిన కాంతనుగూర్చి పల్కుచున్నది)

గీ॥ వాలుఁజూపుల నిగిడించి • పట్టపగలు
ప్రియుల చిత్తవిత్తముల హ • రించెదీవు;
చంచలాక్షి! యపూర్వమీ • చౌర్యచర్య
ఎట్లు నీకబ్బెనో వచి • యింపరాదె?

చం॥ రమణి! మనోహరాధర సు • ధారసధారలఁ గ్రోలువేళ న
స్థిరమయి నామనంబభిల • షించుచు నున్నది శేషభావమున్;
గరములఁబట్టఁ గోరఁదగుఁ • గాదె? విరోచన పౌత్రిభావమున్;
గిరమనురక్తి నీచెలువుఁ • గాంచగఁ గోరెద నింద్రభావమున్.

(ప్రియనర్మోక్తులు)

—• వయస్సంధి వర్ణనము •—

సీ॥ కనుగొనల్ మెలమెల్ల • గానేగుచున్నవి
శ్రవణపుటంబుల • ప్రాంతములకు,
నించుక నెమ్మనం • బెడఁబాయుచున్నది
శైశవక్రీడల • సంగతంబు,
వెనుదీయుసిగ్గుతో • మొనలెత్తుచున్నవి
కుచకుట్మలంబులు • కొమరుమిగుల,

గాత్రిమందంతటఁ • గ్రాలుచున్నది మున్ను
వీక్షించియుండని • వింతసొబఁగు,

గీ॥ బొమ్మలకు శోభనముఁజేయు • పొలుపెతింగె
వన్నెలంజూపుచున్నది • కన్నెమిన్న;
ఇంతయేటికి మారున • కిపుడొ రేపొ
సరసపట్టాభిషేకంబు • జరుగఁగలదు.

— • యౌవనము • —

ఉ॥ చాలు విరించి, యేమిటికి • శౌరి, మనోభవవైరి యీశ్వరుం
డేల? పరీక్షణాధిక వి • జృంభణ సంపదకున్ మదించి, దో
ర్మూలయుగంబునందొరసి • పొంగుచనుంగవ కేపికిన్ వడిన్
వ్రీలిన కంచుకంబుఁగల • స్త్రీ నవ యౌవనమున్ స్మరింపుఁడీ.

— • ప్రణయకలహాంతరితనాయికానునయము • —

మ॥ పడఁతీ! రాత్రి యేగుచున్నది గత•ప్రాయంబునన్ జూడు చం
ద్రుఁడు నెల్లందన మొందె దీపమువలెన్;• దోషంబు దండంబుతోఁ
గడచున్, జన్నులఁ బొంతనున్న కతనన్ • గాఠిన్యమున్ బూను నీ
యెడఁదన్ గోపము సంహరింపుము నను•న్వీక్షింపు మాక్షిద్వయిన్.

సీ॥ ఉదయ దిక్తటమున • నుదయించె రాగంబు
లేదుగా నీకు రా • గోదయంబు,
అదె కృశోదరిచూడు • మంధకారమణంగె
నక్కటా! నీ కోప • మణఁగకుండె,
నింగింగనుంగొన • నిర్మలమయ్యె, ని
ర్మలము గాకుండెనీ • మానసంబు,
కోమలీ వింటివే?•కూయుచున్నది కోడి
మానమింకేటికిఁ • బూనెదీవు,

గీ॥ కోపశీల! నీకోపాంధ • కూపమునను
నన్నుఁ గూలఁ ద్రోయఁగనీకు • నాయమూలనెలి

బాల! యీలీల కీవేళఁ ♦ బాళిఁ జాల
మేలుకొను మేను నీవాడ ♦ నేలుకొనుము.

—♦ వీరరసము ♦—

సీ॥ శాపంబు చేసైన నఁ ♦ జాపంబు చేసైన
జయలక్ష్మిఁ బెండ్లాడు ♦ శక్తిఁ బడసి,
గండి గొంగ యనంగఁ ♦ గామధేనువుఁ గొన్న
కార్తవీర్యార్జును ♦ గండడంచి,
ధర్మసంస్థాపనా ♦ ర్థంబు విజృంభించి
క్షాత్రవంశంబును ♦ సంహరించి,
ప్రీతి లేని దాతయై ♦ బ్రాహ్మణకోటికి
ధారుణీ తలమును ♦ ధారవోసి,
గీ॥ జ్వాలలను జిహ్వాలం గ్రోలు ♦ కాలవహ్ని
యనుచు నమరులు భీతిల్లు ♦ నట్లు మెలఁగి,
వచ్చుచున్నాఁడు కోపాగ్ని ♦ ప్రజ్వలింపఁ
బార్వతీ ధర్మపుత్త్రుండు ♦ భార్గవుండు.

—: కరుణారసము :—

మ॥ తనుజం గాంచిన యంతనే యమితచిం♦తంగుందుచున్ దండ్రి యె
వ్వని కీసోనని యెంచి, యొక్కనికి నుద్వాహంబుఁ గావించు, నా
తనితో సౌఖ్యముఁ బొందునో యమితచిం♦తంగుందునో యంచు వే
గనులం జూచుచునుండుఁ; గష్టముగదా ♦ కన్యాపితృత్వం బిలన్.
చం॥ లలన! వివాహవేళను శి ♦ లా శకలంబును మెట్టుచున్ బద
స్థలవ విభీతి నాదు కర ♦ కంజము నూతగఁ గొంటివీవు, నే
డిలఖుని స్వర్గలోకమున ♦ కేగతి నేగితో నన్నుఁ బాసి? నిన్
దలఁచిన యంత నామ పరి ♦ తాపము జ్వాలవలెన్ జ్వలించెడున్.

—: అద్భుతరసము :—

సీ॥ కలలోకములనెల్ల ♦ గర్భంబున ధరించె
శ్రీపతిపొత్తిఁ ♦ జెప్పఁదరమె?

అమ్మహావిష్ణువు ♦ నవధరించినయట్టి
యహినాథు నేగతి ♦ నరయవలయు?
ఫణిసార్వభౌముని ♦ దృణము లీలంబాల్చు
వారాశినేమని ♦ పలుకవలయు?
నహహా! పాథోనిధిన్ ♦ హస్తంబువంబట్టి
పుడిసెడు నీరంబు ♦ పోల్కఁజేయ
గీ॥ శేషుఁడంభోజముంబోలి ♦ చెలువు మీఱె,
నందు శ్రీవిష్ణు వొక్క మీ ♦ లిందమయ్యెఁ
నయ్యగస్త్యుని వినుతింప ♦ నలవియగునె?
అద్భుతంబన నొప్పదే ♦ యార్యులార?.

—:హాస్యరసము:—

సీ॥ తనకాభరణమైన ♦ పెనుబాము, గణపతి
వాహనంబును మ్రింగ ♦ బయలువెడలెఁ,
తనకుమారునకు వా ♦ హనమైన నెమ్మి, యా
యుగ్రసర్పముఁజంప ♦ నుద్యమించెఁ,
బార్వతీదేవికి ♦ వరవాహనంబగు
సింగంబు గజముఖుఁ ♦ జీల్పఁజెలఁగె,
నిటలపటోద్భూత ♦ చటులాగ్ని పటలంబు
బాలచంద్రు దహింపఁ ♦ బ్రజ్వలించె,
గీ॥ ద్వేషమిగురొత్తఁగ, నసూయ ♦ పెచ్చుపెరుగ
గంగకున్ బార్వతికిఁ బోరు ♦ గడలుకొనియె,
నుగ్రుఁడీయింటి కలఁతలఁ ♦ గోపలేక,
యాత్మహత్యకు మ్రింగెఁబో ♦ హాలహాలము.
సీ॥ పరశురాముఁడునీకు ♦ వరశిష్యుఁడౌఁగదా,
చేరి భూతలము యా ♦ చింపరాదె?
ఖామెత్తి బలరాము ♦ బ్రతిమాలి పొగడి, యా
తని లాంగలంబుఁగై ♦ కొనఁగరాదె?

ఎద్దున్న దేగదా ♦ యెలమి దానికి జోడు,
కాలుని మహిషంబుఁ ♦ గట్టరాదె?
అల కుబేరుఁడు నీదు ♦ ప్రాణమిత్రుఁడుగదా,
వెడలి విత్తనముల ♦ నడుగరాదె?
గీ॥ పశువులంబ్రోవఁ గొమరుండు ♦ వటులుఁగాదె?
అకట! దినమొలవాఁడవై ♦ యరిగి తిరిగి
భిక్షయాచింపఁ దగునె? యో ♦ విశ్వనాథ!
గట్టురాబిడ్డ నయ్యునిన్ ♦ గట్టుకొంటి.
గీ॥ పాము మొలనూలుగాఁజుట్టి ♦ భద్రముగను
చర్మ కౌపీనధారివై ♦ సంభ్రమమున
గరుడవాహను శ్రీవిష్ణుఁ ♦ గాంచినంత
నక్కట! దిగంబరుండవై ♦ నాహరుండు.
ఉ॥ "ఏల వినాయకా! యిటుల ♦ యేడ్చెద" "వమ్మ షడాననుండు నన్
హేళనఁజేసి నా చెవుల ♦ నేపఱలాగెఁ", "గుమార! మానుమీ
లీల" "లితండె నా కనుల ♦ లెక్కిడెనమ్మ," "గజాస్య! యేమి"? "యనన్
గేళికిఁ జీరిముక్కుఁబరి ♦ కించు నెపంబున గిల్లెనమ్మ"; యి
ట్లోలి వచించు పుత్రికుల ♦ నొప్పిడు నొప్పులకుప్పఁ గొల్చెదన్.
క॥ "అమ్మా! కృష్ణుఁడు వెన్నదొంగ" "విను మా ♦ రా! కృష్ణునికంటె" "శ్రీ
దమ్మా తాగెడువాఁడఁగాను" "బలరా ♦ మా తాగుచున్నాఁడవా?"
"అమ్మా! యన్యసతీ పరాఙ్ముఖుఁడ" "కృ ♦ ష్ణా నిక్కముం జెప్పు" "త
ప్పమ్మా" యంచు హసించువాని నెదలో ♦ నశ్రాంతముం గొల్చెదన్.
గీ॥ రసికురాలవు నాయ్యన ♦ ర్ఘంబు గొలుకఁ
దగునె? సామగాన ప్రిపూ ♦ తంబు చూవె;
కూర్మిగలదేని వీనులఁ ♦ గొలుక వచ్చు
నీదు నపకీర్తి వినకుంత ♦ నీరజాక్షి.
అనియొక ఛాందసుండగు ప్రియుండు ప్రియురాలితోఁ బల్కుచున్నాఁడు.

సీ॥ విటుల వంచించి వేశ్యయై ♦ పెంపుఁగాంచి,
పిదప దాసియై కాలంబు ♦ వెచ్చఁబెట్టి,
కుట్టని యనంగ విట విటీ ♦ కులముఁదార్చి,
పడఁతి వృద్ధయై వరపతి ♦ వ్రతనుభోలె.

—:భయానకము:—

చం॥ అరుణరుచి ప్రకీర్ణ నయ ♦ నాంత కనీనికలన్ రహించి, శీ
కరశిత దంతకుంతచయ ♦ ఖండిత మానవకంఠరక్త సి
క్తరసనయై,మృగాంతకమయ ♦కంధరయై, ధృతమండలాగ్రయై,
ధర పద ఘట్టనంగదలఁ ♦ దాటకవచ్చె నకాలమృత్యువై.

—:భీభత్సరసము:—

సీ॥ నక్తంచరులతోడ ♦ రక్తంబుఁ ద్రావుచుఁ
గ్రక్కుచుఁ గాకులు ♦ గ్రద్దలలరఁ,
జిత్తంబులిగురొత్తఁ ♦ గొత్తనంజుడు మెక్క
దయ్యముల్ మత్తిల్లి ♦ తాండవింప,
వేతాళబాలుండు ♦ వెచ్చనినెత్తుఁటుఁ
ద్రావి గజ్జునఁ దేంచి ♦ తనివిఁబొందఁ,
బ్రక్కప్రక్కలనక్క ♦ పలలంబులను మెక్క
నక్కలు దిక్కులఁ ♦ బిక్కటిల్ల,
గీ॥ శాలశైవాలమై కేశ ♦ జాలమమరఁ,
బద్మములఁబోలి వదన బిం ♦ బంబులొప్ప,
నెలమి రక్తనదిన్ పీరు ♦ లీఁదులాడ,
ఘోరసంగ్రామ రంగంబు ♦ కొమరుమిగిలె.

—♦రౌద్రరసము♦—

చం॥ నరపశువెవ్వఁడా ద్రుపద ♦ నందన కుందగఁ గొప్పుఁబట్టె? నా
కురుసభలో నెవండుసతి ♦ కోకలఁగైకొనె? నెట్టికూరు వ్రా
త్సరసిజ శోణితాసవముఁ ♦ ద్రావఁగనేను ప్రతిజ్ఞఁగొంటి? నా
నాగసరి మదు\జదోయ వ ♦ నిన్ బడె; ఁబోవఁగలేరె కౌరవుల్?

## శాంతరసము

మ॥ తలపోయన్ దనుపంజరంబున నవ ♦ ద్వారంబు లుద్ఘాటితం
బులు, ప్రాణంబు వసించుచున్నది ఖగం ♦ బుంబోలి, యేరీతి ని
శ్చలమై యందువసించుచున్నదని యా♦శ్చర్యంబుగాఁ జూచుఁ బ్రా
జ్ఞులకున్, మూఢులు తద్వియోగమునకున్ ♦ శోకింతురశ్రాంతమున్

ఉ॥ శ్రేష్ఠముగాని సంసృతి వ ♦ రిష్ఠముగా మదినెంచి మర్త్యుఁడ
ల్పిష్ఠ సుఖాభిలాషియయి ♦ వేమరు సంతసమొందుచుండు; సం
గుష్ఠము నోటఁబెట్టి మదిఁ ♦ గోరికలీరికలెత్తఁ దృప్తిభూ
యిష్ఠముగాఁగ స్తన్యమని ♦ యెంచి రసించెడు బాలుకైవడిన్.

చం॥ సురలకు బోనమంచు, సిరి ♦ సోదరుఁడంచు, ధ్రువంబుగన్ సుధా
కరుఁడనుచున్ నుతింప దివిఁ ♦ గ్రాలెడు చందురుఁడొక్క పక్షమున్
కరమురహించు, దక్కఁగల ♦ కాలమునన్ క్షయమొందుచుండు, సం
సరణమునందు నే నరుఁడు, ♦ శాశ్వత సౌఖ్యములొందఁ జాలునో?

మ॥ కలిమిన్ మైబలిమిన్ ద్యజించి, బుధ సాం ♦ గత్యంబు వర్జించి, పె
ద్దలవాక్కుల్ నిరసించి, మోహజనిత ♦ ధ్వాంతంబునన్ గ్రుడ్డివై
నలినాక్షీ విషయావటాంబువుల లో ♦ నన్ గ్రుంకుచున్ దేలుచున్
నలినాక్షున్ హరి సంస్మరింపవెపుడున్ ♦ స్వాంతంబ! శాంతింపుమా.

మ॥ ధర నూహింపఁగ శాశ్వతంబగు పదా ♦ ర్థంబెద్ది? వ్యామోహసం
సరణాంభోధిఁ దరించినం దొలఁగు న ♦ జ్ఞానాంధకారంబు; ని
ర్ఝరులన్ బావనమౌ తపోవనమునన్ ♦ స్వాంతంబ! శాంతించి, శ్రీ
హరి పాదాబ్జ మరందపానమున బ్ర ♦ హ్మానందముం బొందుమా.



గద్య॥ ఇది శ్రీమద్భాగవతోప నామక నరసింహ శర్మ ప్రణీ
తాభినవభర్తృహరినామ సుభాషిత గ్రంథమునం
బ్రథమభాగము సంపూర్ణము.

శ్రీరామార్పణమస్తు.